# ప్రసిడెంట్

(మొదటి భాగం)

కర్త:

శ్రీ జంపన M. A., B. Ed.

లెక్చరర్, అన్నామలై విశ్వవిద్యాలయం.



యస్. అప్పలస్వామి అండ్ సన్సు,

పబ్లిషర్సు అండ్ బుక్సెల్లర్స్,

రాజమండ్రి.

ముద్రితము

వేణు ప్రెస్ — రాజమండ్రి.

1945

# ఉద్దేశం

ప్రెసిడెంట్ ఎలక్షనులలో దిగి, ఎంతమంది కష్టపడి గడించిన ఆస్తిఅంతా మధ్యవర్తుల మూలంగా తగలేసి పాడై పోతున్నారు. చదువుకొని పొట్టకు జరక్క పాడయిన విద్యార్థికులెలా సంచరిస్తారో వ్రాయుటయే నా ఉద్దేశం,

చంద్రం.

# 1

'నీవు సెప్పినట్టు, డబ్బేటి సాశ్వితవోయ్, శాస్త్రి! నచ్చాదికారులు, ఎంతమంది సచ్చిపోవటం నేదు. చత్తే వోడు తీసికెల్లాడు సెప్పవయ్యా డబ్బు!'

'అవునండీ అప్పలస్వామిగారు అవును. మరణానంతరం మనం ఒక్క వస్తువుకూడా తీసుకువెళ్ళలేము. ఎందుకంటే ప్రాణానికి ప్రాణంగా ప్రేమించే భార్యా మనం చచ్చిపోతే, మనతో వస్తుందా? పోనీ పుత్ర మిత్రులు వస్తారా? ధన ధాన్యములు వస్తాయా? అంతా వెట్టి—

ఎవరు కాలం తీరిపోతే, వారు వచ్చినట్లోవను చక్కా పోవలసిందే కాని—గుడ్డిగవ్వకూడా తీసుకుపోతారటండీ?

'అవునోయ్ శాస్త్రి! బాగా సెప్పావ్. ఏటో సచ్చేవరకు సెమటూడ్చి, కట్టబడి, గడిత్తేమాత్రం ఏటినాభం? సచ్చేదపుడు, ఎట్టి మొగాలేసుకొని, సూత్తూ డబ్బంతా ఇడిసేయాలిగాని, అంతకంటే ఏటుంది—ఏటయ్యా శాస్త్రి మాట్లాడవ్?'

'చిత్తం, చిత్తం తమరికి తెలియందేమి టుంటుందండీ! తమరు సర్వజ్ఞులు, దైవజ్ఞులునూ—మీకు తెలియని అధ్యాత్మ విషయాలు ఎవరికి తెలుస్తాయండి'

'ఊఁ—బాగా సెప్పావ్. నా సంగతి నీకు తెలిసినంత, ఓరికీ తెలీదనుకుంటా శాస్త్రీ!'

'పూవులో తేనెతీపి, ఒక్క తుమ్మెదకే తెలుస్తుంది—మేఘగర్జనలో ఉండే నినాదం ఒక్క నెమలికే తెలుస్తుంది—వెన్నెల మాధుర్యం, ఒక్క చకోరానికే తెలుస్తుంది—అలాగే మీవంటి పండితుల హృదయాలు, మాకే తెలుస్తుంది. గాని—ఇతరులకు ఎలా తెలుస్తుంది ?'

'సెబాస్—శాస్త్రి సెబాస్'

'మీవంటి రసగ్రహణ పారీణులుండబట్టే, దేశం శాంతివంతంగా ఉంది, లేకపోతే...'

'యుద్ధాలే !'

'గ్రహించారు కదా !'

'ఉఁఊఁ ఇంకా తెలిసికోపోవటం ఏటండీ'

'అందుకనే ఈదేశాన్ని ఉద్ధరించటానికి, మిమ్మల్ని ప్రెసిడెంటు మహాపదవికి పెట్టమన్నాను. నాలుగువేలు కర్చయితే మస్తుకు, ప్రెసిడెంటుకు వచ్చినకీర్తి ప్రఖ్యాతులు మరెవరికి వస్తాయి.'

'ఆఁ ఆఁ మాబాగా సెప్పావ్ పంతులూ అట్టాగయితే పెసినెంటుగిరికి పెట్టమంటావా ?'

'ఇంకా ఆలోచిస్తారేమిటండీ ? మీవంటివారే పెద్ద పదవుల నలంకరించకపోతే ఆపదవుల గతేమిటి ?'

'అవునవును అయితే మన కెంతవుతుందంటావ్'

'ఆఁ నాలుగువే లయితే చాలు'

'ఓసింతేనా ! ఒక నెల్లాళ్ళ సంపాదనలేదు'

'చిత్తం—చిత్తం'

'నాకేటి అబ్జెనను (Objection) నేమగాని, మా ఆవి డేటంటుందోనని, కూంత ఆలోజిత్తున్నా!'

'మీ మాటకు వ్యతిరేకం కూడానా?'

'అయితే పని జరుగుతుందంటావ్.'

'తప్పక'

'రేపు కనబడు—మాటాడేద్దా!'

'చిత్తం! Good Morning'

'ఆ—గుడ్ మాన్ సార్'

అంటుంటే వెంకటశాస్త్రి వెళ్ళిపోయాడు.

వెంకటశాస్త్రి ప్రేక్టీసులేని ప్లీడరు—పొరపాటున ఏదైనా ఒకకేసు వస్తే అది తప్పక ఏబెంచీకోర్టు (Bench Court) దో అయిందన్నమాటే! ఇంటద్దీ, ప్లీడరు గుమస్తాజీతం, ఇచ్చుకో లేక ఏనెలకానెల, తలప్రాణం తోక్కొచ్చేది.

దీనికితోడు ప్లీడరుదర్జా చెలాయించటానికి సూట్లు; సూటుకు తగ్గా బూట్లు; టెన్నిసు ఆటలు; చేతిలో సిగరెట్లు; క్లబ్బులో పేకాటలు—ఇంకా ఇంకా, ఎన్నో ఏర్పాట్లు, పెద్దవాళ్ళల్లో తిరగటానికి, ఈ అధునాతన ప్రపంచకములో చాలా అవసరమయ్యాయి.

వాటితో ఇంట్లో 'క్లయింట్సు' కు బదులు, అప్పుల వాళ్లు ప్రతీనెలాతయారయ్యేవారు పాపం ఏంచేస్తాడు? పెద్దచదువు

చదువుకున్నాడు—ప్రయోజనం ఏముంది ? తింటానికి తిండిలేదు; ఉండటానికి ఇల్లు లేదు, కట్టుకుంటానికి బట్టలేదు ; అన్నీ అప్పులే
కాని తెలివిగల బుర్రేమో — ఒక చక్కటి పనిచేసాడు ఏమిటంటే, కరువులో అధికమాసమున్, తనకొక పెళ్ళాన్ని తగిలించుకోక, ఏదో ఘోటక బ్రహ్మచారిగా జీవయాత్ర గడుపుతున్నాడు పాపం.

ఉన్నా ఆ స్తినంతా ప్లీడరుచదువుకు తగలుపెట్టి వర్షాంతర మేఘంలాగ, వెలవెలబోయాడు. 'కోటివిద్యలూ కూటికొరకే' అని, నాలుగు పిక్కలున్నవారిని ఎలక్షనులోకి దింపి, వాళ్ళు గెలిసినా వోడినా, తన జీవయాత్రమాత్రం నిర్విఘ్నంగా సాగించుకుంటూ ఉన్నాడు. అబద్ధా లాడటానికిగాని, దొంగ సాక్ష్యాలు చెప్పటానికిగాని, అన్యాయాలు చేయటానికిగాని, తలలు మార్చడానికిగాని, ఈషత్తు జంకితేవట్టు. అటువంటి విషయాల్లో 'పిరికితనం,' అంటే ఏంటో ఎరుగని గుండె ధైర్యం గల మొనగాడు,

కోమటి వెంకమ్మను—'మీకంటే పలుకుబడిగల ఆడది యీ మూడు లోకాల్లో లేదు ; మీరు మునిసిపల్ కౌన్సిలర్ (Municipal Councilor) కు నిలబడితే ఎదురుపోటీ చేసేవాళ్ళేలేరు ; మిమ్మల్ని గెలవటానికి ఆ త్రిమూర్తులకు కూడా పిలులేదు ;' అంటూ అమాయకురాలుగు ఆమెను ఆకాశాని కెక్కించి, అక్కడనుంచి నేలమీదకు గభీలుమని తోసివేశాడు. ఆమె మెళ్ళో మెరిసే కాస్త బంగారం 'గంగా సమర్పయామి'

అన్నట్లు ఎలక్షనుకు ధారవోయించాడు. ఆమె అలోలక్ష్మీ అని అహర్నిశాలు ఏడుస్తూ, అధోగతి పాలయింది....కనుక్కరా ఆయన గొప్పతనం.

ఆ ఎలక్షనురోజుల్లో 'శాస్త్రిగారూ ! ఎక్కడికండి ?' అని ఎవరన్నా అడిగితే 'ఇప్పుడు చాలా అర్జంటు పనిమీద వెళుతున్నానోయ్. మాట్లాడ్డానికి వీలులేదు' అంటూ గుండి విరుసుకొని, భూమ్యాకాశాలు పట్టుకుంటూ తిరిగాడు.

ఎలక్షనుకాగానే, మరెవ్వరిని చూడనా అని వేయివేల కన్నులతో వెదికాడు. గోతులేసి నీటిలో గాలాం వేశాడు. దెబ్బతో అప్పలస్వామి తగిలాడు. అతడ్ని ప్రెసిడెంటుగా సిలిపి, దానితో ఒక మేడకట్టేయాలనుకున్నాడు. అదీ అతని ప్రయత్నం ; ప్రయోజకత్వం.

అప్పలస్వామి వట్టి అమాయకుడు. నిశానీదారు, కాని-ఏదో తలవ్రాత బాగుండి, రంగూనుకు కలపవర్తకం చేసి, నాలుగుడబ్బులు గడించాడు.

ఎనిమిదిరూపాయలకు గుమస్తాగా ఉండేవాడు, అదృష్ట వశాత్తు సొంతంగా వర్తకంచేసి ఎనభై వేల పైచెర్లు డబ్బు గడించాడు. దానితో అప్పలస్వామి అల్లా అప్పలస్వామి నాయుడుగా రయ్యారు. దానితో పదిమంది ప్రోత్సాహంవల్ల, నాలుగువేలు ఖర్చుచేసి గవర్నరుగారికి టీపార్టీయిచ్చి, 'రావుబహద్దూర్' బిరుదుకూడా పొందాడు—ఇపుడతడు.

'రావుబహద్దూర్ అప్పలస్వామి నాయుడుగారు అనే పేరుతో పిలవబడుతున్నాడు. ఇంతకూ ఈ పాడుకాలంలో మానవుని పేరు ప్రఖ్యాతులు సంపాదించేది డబ్బేకదా? మహా పండితుడైనా డబ్బుగలవాడు, కాకపోతే పదిమందిలో వాడికి స్థానంలేదు—ఇంతకంటే వెఱ్ఱిప్రపంచం మరొకటి ఉంటుందా?

ఇప్పుడా అప్పలస్వామి, శాస్త్రి ప్రబోధంవల్ల డిస్ట్రిక్టు బోర్డు ప్రెసిడెంటు (District Board President) పదవికి నిల బడదామనుకున్నాడు. ఈదెబ్బలో 'డిస్ట్రిక్టు' అంతా తనచేతిలో పట్టుకొని, ఊపేద్దామనుకున్నాడు. జిల్లాకంతకూ తాను పెద్దనని పించుకొని, మరీ చచ్చిపోవాలనుకున్నాడు. ఇంట్లో భార్యా గౌరమ్మ ఏమంటుందోననే భయం అతనికి లేకపోలేదు. 'ఇంటా విడ' అనుజ్ఞ తీసుకుందామని మీసాలు మెలేశాడు తాండ్ర పాపారాయుడ్లాగ. అంతటితో ఊరికోక క్రొత్త పెళ్ళికొడుకు లాగ, 'ఓటో దిల్‌బహార్' సెంటురాసుకొని, బంగారు మురు గులు మెరుగుబెట్టి ఉంగరాలు సరిజేసుకొని తయారయ్యాడు సాయంకాలం ఐదుగంటలకు.

గవరమ్మ మధ్యాహ్నం గోడకు చరిచిన పిడకలు తీసి గంపలోవేస్తూ మధ్యమధ్య నోట్లోచుట్ట పొగతో ఆకాశం చిన్నచిన్న మేఘాల్ని కాయిస్తూవుంది.

'నేను పెసినెంటుగిరి కొచ్చాక. నాపెళ్ళాంతో సుట్టలు మాన్పించి, కూసింత డబ్బెక్కువైతే అయింది ఏ డక్కును సిగ రెట్టన్నా మొదలెట్టిత్తా. నేకపోతే ఏ పెద్దమొగాడైనా సూత్తే నాపరువు గంగ కలిసిపోదూ!'

అని అనుకుంటూ—‘గారే—గారే’ అంటూ దగ్గర కొచ్చాడు.

‘ఏం నాయుడుబావా! ఇయ్యాల లేటంత ఉసారుగా ఉండావ్?’

‘ఏటుందేటీ? అబ్బో? సెప్పాల్సింది సానాఉంది’

‘అయితే ఏటో సెప్పగూడదు?’

‘ఇంట్లోకిరా అయన్నీ సొపుతాగా’

‘అయితేపద’

సంకలో పిడకలగంప పెట్టుకొని, నోట్లో చుట్టపెట్టుకొని, సావిట్లోకి తయారయింది—

అతడు పడకగదిలోకి దోవతీశాడు, ఆమె గంపసావిట్లో పెట్టి కూడావెళ్ళింది ఇద్దరూ పందిరిమంచంమీద కూర్చున్నారు

‘నాలుగేలు కర్చయితే అయిందిగాని, నాకు ‘రావుబహద్దూరు’ బిరుదిచ్చినపుడు నీమనసెట్లాగుందే?’

‘ఆనాడే సొప్పానుగదూ!’

‘ఆఁఆఁ మళ్లీ ఇందావనికదూ!’

‘ఎట్టుందో సొప్పనా! గుండీమెడ నల్లకోటేసుకొని, సేతిలో ఎండిపిడి కఱ్ఱుచ్చుకొని, నీవు మోటూరు కారులో కూకుంటే, పెద్దపెద్దోరంతా నీమెళ్లోదండలేసి-‘నాయుడుగారికిజై నాయుడుగారికిజై’ అంటుంటే—నిజంగా నామనసు నామనులో లేదంటేనమ్ము. నినుసూత్తుంటే, సాచ్చాత్తు, కిట్టబగమానుని సూచినట్టేఉంది’

'అఁ అఁ అద్గదీ! అద్గదీ! అట్టాసావ్పు'

'ఎదవడబ్బేటి నెక్క—అంత ఒయిబోగం వచ్చినపు డని పించింది మనసు'

'నిజం!'

'నా కేటి అబద్దం ఆడేవరకు'

'ఒట్టెయ్-ఒట్టెయ్'

అంటుం టే ఆమెవట్టేయటం—అతనివళ్ళు పులకరించటం గలిగాయి, వారిద్దరి ఆనందం చెప్పటానికి వీలులేదు వారి రెండు హృదయాలు ఆనందంలో ఐక్యమయ్యాయి – అమాయకుల ఆనందం వర్ణించటానికి ఎవరితరం?

'రావుబగుద్దూరు కే అంతసంతోసమైతే, ఈజిల్లానంతా నేనే ఏల్తాననుకో, అపుడెలాగుంటుం దే?'

'అంత ఒయిబోగం కలగా లేగాని, ఏడుకొండల ఎంక టే సునకు ఎయ్యి టెంకాయలు కొట్టనూ?'

'అయితే నీకూ ఇట్టమున్నమాట'

'అంత పెద్దపదవొత్తుం టే, ఓనకిట్టం ఉండదూ!

'ఇంతకూ అదేటో తెలుసా?'

'నా కేటి తెలును, నీవుసెప్పాలిగోని'

'అయితే సెపుతా ఇను, దాన్నే 'పెసిడెంటుగిరి' అంటారు'

'ఏటీ? పెసిడెం టే?

'అఁ అఁ మరిం కేటనుకున్నావ్'

'కామయ్యపంతులోరు సేశారు అదేనా?'

'ఆఁ అల్లదే'

'మనకెట్టాగొత్తాది'

'నాలుసంచిలు పాఠాశామంటే, టపేలుమని గిరి తిరికి మనకొచ్చిందన్న మాటే. మనం 'పెసిడెంటు' అయ్యామన్న మాటే'

'ఓస్ ఇంతేనా! ఎదవ నాలుగేలు లెక్కేటి! నా మొగుడు 'పెసిడెంటు' అయ్యాడంటే, నా కెంతపేరు'

'పెసిడెంటుగిరికి, ఒకసంచిరూపాయలోసి కారుకూడా కొనాలి'

'చిన్నకారు కొనకు. దాంట్లోకూకుంటే మనిసే కనపడ్డు, ఏబసుకారో కొంటే మనిసంతా కనబడతాడు'

'నీయిట్టం—నీయిట్టానికేనాడు ఎదురు సెప్పానో నివు సాప్పా'

'ఈలుంటే కారుకి, ఆపైకప్పుకూడా తీసేత్తే మాబా గుంటుందనుకుంటా మనిసంతా కనబడతాడు'

'దానికేటి— అట్టాగే చేద్దాం'

'అయితేమరి ఆ ఏర్పాటు సూసుకోండి'

'ఉఁఊఁ ఇంకమానా్తనా రేపే శాత్రితో సెప్పేసి రంగం లో కురికేయను'

'సూసుకో! పెసిడెంటుగిరికిరావాలి'

మనం తలుసుకోటం_కాకపోటం కూడానా?'

అంటుంటే అతనికన్నులలో మెరిసే ఆనందరేఖలు—అతని ముఖాన్న వెలిసిన చిరునవ్వు వెన్నెల—వర్ణించటానికి వీలు లేదు. వారిఅమాయకత్వంలో ఉండే నిర్మలానందం, అనుభవైకవేద్యం.

శాస్త్రీ మాయమాటల్లోపడి, ఏ నాలుగువేలకో ప్రెసిడెంటు అయిపోవచ్చుననుకున్నాడుగాని, నాలుగువేలు, ఏనలభై వేలో అవుతాయి అనుకోలేదు. శాస్త్రి వంటి మోసగాడు ఒక్కడైతే చాలదూ, కొంపలుతీయటానికి.

ఆకాశాన్నంతా వెన్నెలవెలుగుతో, జ్యోతిర్మయం జేయటానికి, ఒక్కచంద్రుడు చాలు—

అచంద్రుణ్ని కప్పిపుచ్చి, ప్రపంచం అంతా కారుచీకటిమయం చేయటానికొక్క కాలమేఘం చాలు—

దేశాన్ని ఉద్ధరించటానికి గాంధీవంటి మహాత్ముడు, ఒక్కడు చాలు—

దేశవినాశనానికి, హిట్లరువంటి దురాశపరుడు, ఒక్కడు చాలు—

* * * * *

*

*

## 2

అది ఒక సుందరభవనం—ఆభవనానికి సింహద్వారం ప్రక్కనే ఒక బోర్డుంది దానిమీద—

మిస్ లీలా, ఎం. బి. బి. యస్.

అని ఇత్తడి అక్షరాలతో చెక్కబడి ఉంది.

ఆసింహద్వారం దాటగానే, హాలుప్రక్క— In — Out అనే 'బోర్డ్' ఉంది.

ఆరోజు ఆదివారం, ఉదయం ఎనిమిదిగంటలకు, శాస్త్రి లీల యింటికి వచ్చాడు. ఆమె లోపల ఉన్నట్లు ఆ బోర్డే చెబుతుంది. వెంటనే కాలింగ్ బెల్ (Calling Bell) నొక్కాడు. దానితో బట్లరువచ్చి, ఆయనను హాలులో కూర్చోమని, అమ్మగారి ఆజ్ఞ చెప్పాడు. శాస్త్రి హాలులో కూర్చున్నాడు.

అతడు కూర్చున్న ఒక అరగంటకు, పూర్తిగా టాయిలెట్ చేసుకొని, ఒకచేతికి రిస్టువాచీ, మరోచేతికి రెండుగాజులు మెడ్లో సన్నని గొలుసు వేసికొని, 'టక్—టక్' మని కాలి బూటు చప్పుడౌతుంటే, చిరునవ్వు నవ్వుతూ—

'హాలో! శాస్త్రి! గుడ్ మోర్నింగ్'

అంటూ ఒకకుర్చీ లాక్కొని కూర్చుంది.

'హాలో! లీలా! గుడ్ మోర్నింగ్'

అంటూ శాస్త్రి కుర్చీ లోంచే, అభివందనం చేశాడు. ఆంగ్లసాంప్రదాయంలో.

ఎంతకాలంనుంచో, ఒకరిపై మరొకరికి అనురాగం ఉన్నట్లు, వారిచూపులవల్లే తెలుస్తుంది. వారిరువురు అలా కూర్చుండగానే, బట్లరు ట్రేతో కాఫీ, ఎన్నడో చేయబడిన బిస్కట్లు, ఎండిపోయిన రొట్టెముక్కలు తీసుకొచ్చాడు. వారిద్దరూ ఆప్యాయంగా టిఫిన్ తీసుకొని, కాఫీ తాగుతూఉన్నారు.

'లీలా! నేనంటే నీకెంతఅభిమానం'

'నీకంటే నాకెవరున్నారుశాస్త్రీ!'

'అలా అనకు లీలా! లలితకళాభిమానివి; విద్యాసరస్వతివి; వినయవతివి;......'

'ఇంకా...తరువాత'

'......రూపుదాల్చిన రతీదేవివి; అధునాతన ప్రపంచాన్ని అరచేతిలోపెట్టుకొన్న అధికారిణివి;...'

'తరువాత...'

'అనురాగ నిధానమవు; రాకాచంద్రికవు...'

'అహ్హాహ్హా! చాలుచాలు. ఇక్కడికే మోతాదు చాలా ఘాటుగా తగిలింది. నిజంగా ఇవన్నీ ఎక్కడనేర్చుకున్నావోయ్'

'ఎక్కడేమిటి లీలా! నీవంటిదివ్యమంగళ స్వరూపాన్ని చూస్తే, కవిత్వం రానివాడికికూడా కవిత్వం వస్తుంది'

'నమ్మేటట్లే చెప్పావు. మొత్తానికి ఏకవో తన ప్రబంధనాయికిని వర్ణించటంలో ఉపయోగించిన సామానంతా ఒకచోట స్టోరుచేసి, ఆస్టోరుబాక్సు (Store Box) ఇక్కడ విప్పినట్లుందే'

'లేదు లీలా పొరబడుతున్నావు'

'అయితే నా ఉద్దేశం పొరపాటంటావా?'

'ఎన్నడూ అనను. కొందరు భావకవులు నీవు చెప్పినట్లు కొన్ని మృదువైనవి, మధురమైనవి, చక్కనిపదాలు ఏరుకొని, వారపద్యాలలో వీలున్నా చోటల్లా ఇరికిస్తారనేమాటనిజం—

కాని నావిషయంలో మాత్రం అది అబద్ధం—కొన్ని మధురదృశ్యాలను చూచినా; కొన్ని విచిత్ర సంఘటనలను పరిశీలించినా; మానవుని హృదయపాత్రలో దాగున్న కవితారసం, పొంగి, ఉప్పొంగి, భాషారూపంగా ప్రవహిస్తుంది.

అలాగే నీవంటి వయోయవ్వన సౌందర్యవతి, మా కవిత్వానికి మంచిసామగ్రి'

'ఏమిటీ ఈమధ్య కవివికూడా అయ్యావేమిటి కొంపతీసి'

'ఇంకా తెలీలేదు. మొన్న 'లేడీస్‌క్లబ్బు' కు ప్రెసిడెంటు కూడా ఉన్నానే?'

'ఓహో! I see అదినీవా? ఆరోజున ఆడవాళ్ళంతా గోలచేశారని, మధ్యలో ప్రెసిడెంటుగారి ఉపన్యాసం ఆగిపోయిందని చెప్పుకున్నారు. అది నీవేనా?'

అంటూ లీలనవ్వటం మొదలుపెట్టింది. తన సరుకుకాస్తా బయటపడినందుకు, తనలో తాను ఎంత సిగ్గుపడ్డాడో ఆదైవానికెరుక— ఆమె తనను పట్టి [illegible] గాడను కుంటుందేమోనని, కొంచం డబాయిద్దామని—

'లీలా! అయితే క్లబ్బువిషయాలు తెలిశాయన్నమాటే'

'పూర్తిగా'

Uneducated Brutes ముందు నా ఉపన్యాసా లేమి పనికివస్తాయిచెప్పు? చెవిటివానికి శంఖంలాగ; అంధునకు అద్దం లాగ; నపుంసకునకు భార్యలాగ; నా లెక్చరు వాళ్ళముందు నిష్ప్రయోజనం అవకేంజేస్తుంది'

'అన్నివిషయాలు తెలుసుకున్నవాడవు, అడవాళ్ళక్లబ్బు కేఅద్యక్షత వహించలేకపోతే, రేపే(District Board President) డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటుగా చెయ్యవలసివస్తే ఏంచేస్తావు?'

'ఏంచేస్తానా, దుమ్మెత్తిచేస్తా. అన్నట్లు అప్పలస్వామి ప్రెసిడెంటుగా ఉంటాడంట విన్నావా?'

'ఎవరుచెప్పారు?'

'ఆలా అనుకుంటున్నారులే?'

'పాపం, అమాయకుడ్నిచేసి ఏనీవంటివాడో రంగంలో దింపిఉంటాడు'

'అన్నీ నామీదే తోసేస్తావు'

'అటువంటి విషయాల్లో నీకంటెసమర్థు లెవరుంటారు శాస్త్రీ'

'ఛా. ఛా. అటువంటివానిని ప్రెసిడెంటుగా ఎలాఉండ మంటానులీలా? నాకేం మతిలేదనుకున్నావా? వాడు వట్టిఫూల్ అంటుంటే లీలకు మరోకస్నేహితుడు 'జేమ్సు' తయారయి—

'హలో! గుడ్‌మోర్నింగ్ లీలా! గుడ్‌మోర్నింగ్ శాస్త్రీ అంటూ ఒక కుర్చీలోకూర్చుని—

'ఏం శాస్త్రీ! అప్పలస్వామిని ప్రెసిడెంటుగా నిలబెడుతు న్నావంటే'

శాస్త్రి గుండె జారిపోయింది. లీలను తన లీలచే తోలు బొమ్మను చేద్దామనుకున్నాడు. కాని, జగన్నాటకంలో కర్మ సూత్రించే తానొక తోలుబొమ్మయి, జీవయాత్ర నిర్వహిస్తు న్నాడనా న్న సంగతి మరచిపోయాడు. అదే సృష్టిలోఉండే విచి త్ర—మనం ఎదటివారిని మోసం చేస్తున్నామని సంతోషిస్తాము కాని, మనం మోసగింప బడుతున్నామనేసంగతి మరచిపోతాము ఎదటివారిని గోతులో పడదోస్తున్నాంగదాఅని సంతోషిస్తాము; కాని మనకా గొయ్యిని భగవంతుడు మన కై అంతకుముందే నిర్మించాడన్న సంగతి మరచిపోతాము. ఎదటివారిని కష్టపెట్టి కన్నీరు కార్పిస్తాము; కాని, మనం ఆకన్నిరుకార్చాలన్న సంగతే మరచిపోతాము,

ఎందువల్ల ?

అజ్ఞానాంధకారంలో కన్నులు మూసుకుంటంవల్ల— కన్నులు తెరచి తేజోమూర్తి అయిన భగవంతుని తేరిపార చూడలేకపోవటంచేత—

చూడండి—

శాస్త్రి ఇంకా తన స్థితిని ఒప్పుకుంటాడేమో—

'అబ్సర్డ్ (Obsurd) అటువంటి అక్షరశూన్యుని ప్రెసి డెంటుగా ఎలాగుండమంటాను జేమ్సు?'

'పైగా ఇదొకటా?'

'నీకెవరు చెప్పారో చెప్పు?'

'ఎవరు చెప్పటం ఏమిటి?(First hand Information) ఆ అప్పలస్వామే చెప్పాడు.'

'అయితే బాగా కోశాడు'

అంటూ విరగబడి నవ్వటం మొదలు పెట్టాడు. ఆవిషపు నవ్వులో ఎన్ని రాజ్యాలన్నా కూలిపోతాయి, ఎన్ని పవిత్ర హృదయాలన్నా మండిపోతాయి, ఎన్ని రహస్యాలైనా కప్పడిపోతాయి.

లీలా జేమ్సులకు, శాస్త్రి చెప్పింది నమ్మక తప్పింది కాదూ—

'అయితే శాస్త్రీ! నీమీద సుబ్బయ్య సాహుకారు 500 రూపాయలకు చేసిన డిక్రీ ఏమైంది?'

ఈప్రశ్నకు శాస్త్రికి మరింత ప్రాణగండమైంది. లీలను వలపు సంకెళ్ళచే బంధించి, లీలదగ్గరున్న కాస్త డబ్బు, 'గుటకాయస్వాహా' చేద్దామనుకున్నాడు. అందుచే లీలముందు తానొక లక్షాధికారిగా నాటివరకు నటించ లిగాడు—జేమ్సు తన అప్పుల సంగతిచే ఆమె తన నెలా నమ్ముతుంది?

ఏలాగైనా ఆ విషయంలోకూడా డబాయించాలనుకొని

'నీకువాడి విషయం తెలీదేమిటి జేమ్సు?'

'నీవు చెప్పందే ఎలా తెలుస్తుంది శాస్త్రి!'

'ఆసుబ్బయ్యున్నాడే—వాడు వట్టి రోగ్గులే! (Rogue) అందుచేత వాడ్ని కోర్టుకీడ్చి, వాడిగడ్డి వాడికి పెడదామనుకున్నాను. అందుచేతగాని, లేకపోతే వెధవ అయిదు వందల రూపాయలు, గిఱ్ఱుమని తిప్పివాడి ముఖాన్న పారవేయనూ!'

'వాడిని పదిమార్లు కోర్టుకు తిప్పితే, మనం మాత్రం తిరగొద్దూ'

అని లీల ఉక్కిరిబిక్కిరయ్యేటట్లు ప్రశ్నించింది. అటు వంటి తుక్కు ప్రశ్నకు లొంగుతాడా శాస్త్రి!

'అదికాదులీలా! నేనెలాగున్నా ప్లీడరును కాబట్టి రోజూ కోర్టుకు వెళ్ళటం తప్పదు. వాడి కలాకాదుగా'

'అవునవును—అందులో యమ ప్రాక్టీసుఉన్న వాళ్ళ వేమో, రోజూ ఏబెంచీకైనా వెళ్ళతీరాలి'

అంటూ జేమ్సు ఆక్షేపిస్తూ అన్నాడు. దానితో లీల పక్కుమని నవ్వింది—ఆనవ్వు శాస్త్రి హృదయాన్ని వేయి చీలిక లుగా చీల్చివేసింది_అతని తల పరాభవంచే క్రుంగిపోయింది— సిగ్గుచే అతని పెదాలు వణికాయి

ఇంకక్కడుంటే లాభంలేదనుకొని, బిక్క ముఖం వేసుకొని—

'లీలా! మళ్ళీ కలుసుకుంటాను'

అంటూ లేవబోయాడు. అంతలో తోటిప్లీడరు పూర్ణా నందశర్మ వచ్చి—హాలో—హాలో! అంటూ గుడ్ మోర్నింగులు చేసేసి, రావటం-రావటం వెనకాముందూ చూడకుండా శాస్త్రి ఏమనుకుంటాడో అని ఆలోచించకుండా—

'ఏరాశాస్త్రి! నీ హడావుడి చాలా హెచ్చుగాఉందే! అని వెకిలినవ్వు నవ్వుతూ అన్నాడు. అంతకుముందే సకంచచ్చిన శాస్త్రి, శర్మ ఇంకా ఏంరహస్యాలు పయుటపెడతాడో అని హడలెత్తిపోతూ—

'హాడావుడి ఏముందిరా!'

అని నెమ్మదిగా అనలేక అనలేక అన్నాడు.

'శాస్త్రి! రాత్రి మీయింటిదగ్గరున్న వెధవముండ సుహా లక్ష్మమ్మ మీదకు, నలుగురికి తాగబోయించి, పంపించి నానా అల్లరి చేశావంటే, ఆముండ లభో—లభో మని ఇంటింటికీ వెళ్ళి ఏడ్వడం మొదలుపెట్టింది.

అయినా నీకున్నా శక్తంతా వెధవముండలమీద చూపెడుతున్నావేరా!

అంటూ గుక్కతిప్పుకోకుండా లంకించుకొన్నాడు. దానితో శాస్త్రి ప్రాణాలు నిలువునా కూలిపోయాయి. మొఖం మీద కత్తి పెట్టుపెడితే రక్తం చుక్క లేదు—

'శర్మా! ఎవరికష్టాలు ఎవరికి తెలుస్తాయిరా! దానిఇంట్లో ఉన్న ఆచారిని అది కూనీ చేయించపోతే. వాడునాతో తలా నోరూకొట్టుకొని, గోలుమని ఏడ్చాడు. పాపం! స్నేహితుడు కదూ! వాడిమీద జాలిపొంది ఏదో ఆవిడ్ని డబాయిస్తే కొంత పవరు తగ్గిస్తుందేమోనని అలాచేశాను. అంతకంటే మరొకటి ఏమీలేదు'

'కోయిరా కోతలు—'తాడి చెట్టెందుకెక్కావంటే, దూడ గడ్డికోసం' అన్నట్లు ఆవిడ్నెందుకు అల్లరి చేశావంటే ఎవరికష్టాలో తీర్చటాని కంటావేమిటి నాముఖం?'

'శర్మా! నామాటలు నమ్మితే సంతోషిస్తాను. లేకపోతే విచారిస్తాను'

'శాస్త్రీ! నీకు విచారం కూడానా?'

అంటే లీలాజేమ్సులు పక్కుమని నవ్వారు. దానితో అక్కడ ఒక్క క్షణం ఉండలేక—

'లీలా మళ్ళీవెసా-శర్మగారివంటి మహాత్ముల యెదుట మేము నిలువలేము. సూర్యుని ముందు నక్షత్రాలుండ గలవా?

'అలాగంటోయి శాస్త్రీ! ఏదో ఆక్షేపిస్తున్నట్లున్న దే'

'నేను నీవంటివానిని ఆక్షేపించి, ప్రపంచకంలో తలెత్తుకొని తిరగటమే! ఎంతమాట;(ఆకలిగొన్న పెద్దపులి గృహాలో నుంచి బయటపడితే, మేకలాగగలవా?)

అంటూ ఎఱ్ఱవారిన కళ్ళతో అక్కడనుంచిలేచి గుమ్మం దాటాడు—

'ఏం పౌరుషమురా నాయనా!(అన్నిపాములు తలలెత్తితే బురదపాముకూడా తలెత్తిందట)— పడగలేదన్నా సంగతి మరచి పోయి—'

అంటూ శర్మ అనేసరికి వెళుతూవెళుతూఉన్న శాస్త్రి హృదయం వెయివేల చీలికలుగా చీలిపోయింది. సింహగర్జనకు మహారణ్య మధ్యంలో, నిశ్శబ్దప్రశాంతి భగ్నం అయినట్లు, అతని శాంతిభగ్నం అయిపోయింది.

గుమ్మందాటి పదడుగులు వేశాడు. అతడక్కడకువచ్చిన సంగతి తెలుసుకొని, అతని గుమస్తా వెంకయ్య ఆరు నెలలబట్టీ ఇవ్వవలసిన జీతం ఖచ్చితంగా నిలబెట్టి అడుగుదామని కాపుకాసి కూర్చున్నాడు పాపం! అతడుమట్టుకు ఏం చేస్తాడు? స్కూలు

ఫైనలు వేసయి, ఏనర్వీసుకమీూషన్ వేసుకాలేక, మరో ఉద్యోగం లేక, పొట్టగడిచే మార్గం వేరేలేక, శాస్త్రి దగ్గఱ గుమాస్తాగా జేరాడు.

శాస్త్రి మట్టుకు ఏంచేస్తాడు? బి. యల్. ప్యాసయ్యాడు ప్లీడరువృత్తి ఆరంభించాడు. శ్మశానభూమిలో ఆకలిగొన్న నక్కకు అస్థిపంజరాలైనా దొరుకుతే దొరుకుతాయిగాని, మానవుని కడుపుమంటను చల్లార్చటానికి, మార్గం ఈదరిద్ర బానిస హిందూదేశంలో కనబడలేదు.

‘శాస్త్రిగారూ! నమస్కారం’

అంటూ వెంకయ్య మహాప్రవాహానికి అడ్డునిలబడ్డ పర్వతంలా, శాస్త్రికి అడ్డుగా నిలబడ్డాడు.

శాస్త్రి కోపంతో—

‘ఏం వెంకయ్యా! ఎవరైె క్లయింట్సు వచ్చారా!’

‘...............’

‘మాట్లాడవేం? ఒక్క క్లయింటూ రాలేదు’

‘ప్లెయింటున్నా, క్లయింటెవరూ రాలేదుగాని....పప్పు బియ్యం ఇచ్చిన అప్పులవాళ్ళు మాత్రం యమకింకరుల్లాగ ప్రత్యక్ష్యం అయ్యారు.

‘ఏడ్చారు...సరే...ఆ సంగతి చెప్పటానికేనా ఇక్కడ నాకోసం కూర్చున్నావు?’

‘అబ్బే వాళ్ళసంగతి చెప్పటానికి కాదండి—’

‘మరింకెందుకు?’

'నాసంగతి చెప్పటానికి'

'నీసంగతేమిటి?'

'మరచిపోయారు. ఎన్నిసార్లడగనండి,(నా ఆరునెల్ల జీతం ఇంట్లో వంటకు బియ్యంలేవు, మంటకు పుల్లలులేవు; తింటానికి భోజనం ఎలాచెప్పండి!')

'బాగా చెప్పావు, నాకున్నదికాబట్టి, నీకెలాగో చెప్పనా'

'అయితే నాగతేమిటి?'

'ఆమాత్రం తెలీదంటోయ్! నాగతేమిటో, నీగతిఅంతే!'

'అయితే ఆస ఒదులుకోమన్నారా?'

'ఒదులుకోవద్దు—తగిలించుకోవద్దు'

'ఏంచెయ్యమంటారు?'

'నాలుగురోజు లాగవోయ్! నీఅప్పు బంగారంగాను. మొత్తం అంతా లెక్కచూచి ఇచ్చేస్తాను'

'ఎలాగండి? క్రొత్తకయింట్లేమన్నా వస్తారా?'

'నాబొంద—అదికాదోయ్'

అని అతడ్ని దగ్గఱకు పిలిచి చెవులో ఏదోచెప్పాడు.

'అదాఅండి—అదా-ఎలక్షనులోనా!'

అంటూ గట్టిగా అరవటం మొదలుపెట్టాడు. అతి రహస్యం బట్టబయలౌతుందనే భయంతో—

'ఉఁఉఁ ఆదేనోయ్! దానివల్లే వస్తుంది డబ్బు. ఇంక యింటికివెళ్ళు—కొద్దిరోజులకు నీ జేబులు రూపాయల మయం చేస్తాను.'

'చిత్తం-చిత్తం. తమరు తలుసుకోనే తలుచుకోవాలి గాని, తలుచుకుంటే మాయిల్లు బంగారపు కొండై పోదండీ?'

'అలాగేమరి'

'చిత్తం—చిత్తం'

'నాకున్నాది నీకు పంచకుండా ఉంటానంటోయ్! ఇంక వెళ్ళు.'

'చిత్తం—'

అంటూ అక్కడనుంచి వెళుతూ-'మహాశయుని దయతో అప్పులు పంచకుండా ఉంటే అంతేచాలు' అనుకుంటూ, నాలుగు తిట్టుకుంటూ గుమాస్తా వెళ్లాడు.



## 3

బ్రతుకు జీవుడా అనుకుంటూ శాస్త్రి యింటికిజేరాడు. ఇంటిగుమ్మాన్ని కాసుక్కూర్చున్నారు ఇంటి యజమాని అద్దికోసం.

చేతులో పట్టుకున్న అతనిగుండెలు కాస్తా చేతిలోనుంచి జారిపోయాయి. నాలుగునెలలఅద్ది ఇవ్వాలి. ఎన్ని వాయిదాలు వేశాడో అతనికే లెక్కలేదు. ఇంక నతడ్ని విడిచేటట్టులేదు—

ఏదోమార్గం చూడాలనుకున్నాడు. యజమాని కొండమ్మగారికి ముందుగానే ఎంతో ఆనందంగా—

'ఓహో! కొండమ్మగారా! దయచేయండి దయచేయండి అలా బయట నిలబడ్డారే.'

అంటూఎంతో భక్తివినయాలుకనబరిచాడు. ఆనక్క విన యాలకు కొండమ్మ వళ్లు మరీ మండిపోయింది.

'నాకంటే ముందుగా శాస్త్రిగారే ఇంట్లోనుంచి దయ చేయవలసి ఉంటుంది'

'అలా అంటున్నారే కొండమ్మగారు తమకీవేళ ఎక్కడ లేని ఆగ్రహం కలిగినట్లుందే!'

('ఆగ్రహంలేదు—అనుగ్రహం లేదుగాని)— తమరీయవల సిన 80 రూపాయలమాట ఏంచేశారు? ఇవాళ ఆఖరువాయిదా'

'ఆహా! కామందులు, మీరు అబద్దం ఆడతారా!'

('అబద్ధాలో సబద్ధాలో) డబ్బుమాట చెప్పకుండా ఇవన్నీ ఏమిటండీ'

'చిత్తం—చిత్తం'

'డబ్బుచాలా అవసరం అంటుంటే'

'డబ్బుచాలా అవసరమే—ఎవరుకాదనగలరు!'

'ఏమిటీ నీఉద్దేశం?'

'ఉద్దేశానికేముంది.(మీకివ్వటానికి చేతిలో డబ్బులేదు ఇంట్లోనుంచి వెళ్ళటానికి ఇష్టంలేదు')

'ఐతే ఏమంటావు?'

'చెప్పానుకదూ—వెళ్ళనని'

'ఏమిటోయ్, మా పొగరుగా మాట్లాడుతున్నావు డబ్బిమ్మంటే ఈయవు; పొమ్మంటేపోవు; ఇదేనేంటయ్యా నీ ప్లీడరు మరియాదా?'

'ఇదిగో కొండమ్మా! మరియాదా-గిరియాదా రానీయక. నాచేతిలో డబ్బున్నపుడిస్తాను. నీకు భయం ఐతే కోర్టులో దావా చేసుకో. ఇష్టంఐతే ఆదావా కేసుకూడా నాకే ఇయ్యి—కేసులు రాక చాలా బాధలుపడుతున్నాను.

'ఇంతకూ సన్నుచూస్తే మీకు చాలా వేళాకోళంగా ఉందే!'

'వేళాకోళంకాక ఏమిటోయ్ ఎలాగైతే ఒకయిల్లుఉందో లేదో కాని, ఊరికేడబాయిస్తేవేం? మామూ వేలూ, లక్షలూ అప్పులున్నవాళ్ళనే ఇంత ఇదిగా డబాయించి అడగరూ—వెధవ 80 రూపాయలకేనా, నిలదీసి మరీ అడుగుతున్నావు!'

వెళ్ళువెళ్ళు-చాల్లే పెద్దమనిషివి. ఉత్తామధ్యం లేకుండా అడుగుతున్నావు పైగా ఇల్లు ఖాళీ చెయ్యాలంట ఏమిటో ఈ ధిమాకు'

'అయితే నాయింటికి కూడా నాకు పెద్దరికం లేదేమిటి?'

'ఏమీలేదు-కావాలంటే నోటీసు ఇచ్చుకో-ఆరునెలల వరకు మాట్లాడటానికి బ్రహ్మదేవునిక్కూడా వీలులేదు-నీ దిక్కున్నచోట చెప్పుకో. ఏదోపెద్దమనిషికదా అని మర్యాదగా మాట్లాడుతుంటే, నెత్తెక్కి పిండికొడుతున్నావే జాగ్రత్త!

ఏమనుకున్నావో మరొకమారు అడిగావంటే, ఆరువేల రూపా యలకు పనువున్నట్టుందావా తెచ్చి, దుంపతెగేస్తా.'

అంటూ కొండమ్మ జంకినకొద్దీ, శాస్త్రి డబాయించటం మొదలుపెట్టాడు. 'ఏమండీ' మానివేసి 'నీవు' లోకి దిగింది— ఇంక 'ఏరా' లోకికూడా దిగుతుంది.

పాపం! కొండమ్మ ఆట్టే ప్లీడరుగారిని అడిగితే కోర్టుక్కొంపతీస్తాడేమోననే భయంతో—

'ప్లీడరుగారూ! మీకింత కోపం వస్తుందనుకోలేదండీ'

'మాకెందుకండీ కోపం! ఇల్లుగలవాళ్ళు మీరు అద్దెకొంప వాళ్ళంమేము; మీరుండమంటే ఉండాలి-పొమ్మంటే పోవాలి అద్దికొంపలుకంటే, సత్రవలు మేలుకదండీ!'

'ఆహాఁ అలా అనకండి. మీరు సరస్వతీపుత్రులు.'

'లాభం ఏముందండి. మీవంటి లక్ష్మీ పుత్రులముందు నిలువగలమా! 'ధనమిదం జగత్' అని ఊరికనే అంటారా?'

'బాబూ మీఅద్దెతో బ్రతకాలి అందుచేత అలాకష్టంగా అడిగానుగాని, మరొకవిధంగా అనుకోకుండా క్షమించాలి.'

'ఎంతమాట కొండమ్మా-పాపం ఎవరి ఇబ్బందులు ఎవ రికి తెలుస్తాయి?'

'చిత్తం'

'కొండమ్మా! అయిపోయిందేదో ఐపోయింది. నీకుతప్ప కుండా పది, యిరవై రోజులలో ఇచ్చివేస్తాను. కాబట్టి ఏమీ అనుకోకుండా వెళ్ళు'

‘తమదయ’

అంటూ కొండమ్మ చేసేదేమీ లేక వెళ్ళిపోయింది.’

‘డాబుసరికి-దబాయింపుకి-లొంగి-వంగి, సలాం చేయని వ్యక్తి, ఈ విశ్వప్రపంచంలో అరుదు...........’

పసుపుకుంకుమలతో—భోగంది ;

కాషాయివస్త్రాలతో—కపటసన్యాసి ;

బురఖాధారణంతో—ఫకీరు ;

మతసూత్రాలతో—మతాధికారి ;

గురూపదేశంతో—దొంగగురువు.

యావద్భారతదేశాన్ని మోసంచేసి-కబళించివేస్తున్నారు ‘మతం’ అనే ముసుగుతో- హిందూదేశాన్ని మోసం చేయవచ్చునని, వివేకానందస్వామి ఊరకనే అన్నాడా! (It is easy to deceive India by the garb of Religion)

ఇంతకూ న్యాయానికి రోజులు ఏకాలంలో ఉన్నాయని ఈకాలంలో లేవని విచారిస్తాను.

రాముని కాలంలో—రామాయలు;

పాండవులకాలంలో—పాండవులు;

అన్యాయపరులయ్యే బాధపడ్డారా? ఎప్పటికీకాదు—ఐనా ఈజన్మలో పాపపుణ్యాలవల్ల, మనజీవయాత్ర నిర్ణయింపబడదు. ఎన్నిజన్మల పాపపుణ్యాలో ఈజన్మలో కష్టసుఖాలుగా పరిణమించి-మనజీవితయాత్రను వివిధమార్గాలలో నడిపిస్తాయి. విధికంటే బలవత్తరమైనశక్తి, ఈవిశ్వప్రపంచంలో ఏముంటుంది? విధి చేతిలో ఏమానవుడు కీలుబొమ్మకాడు?—

నాకంటే అధమాధములు; విజ్ఞానసూన్యులు; విద్యావిహీన పశువులు; ఎందరులేరు? వారందరూ నాలాగ తింటానికి తిండి, కట్టుకుంటానికి బట్ట; లేకుండా కర్మదేవతవంక, కనికరం కోసం, కన్నెత్తిచూస్తూ, కాలం గడుపుతున్నారా? ఎవరి పూర్వజన్మ 'కర్మ'నుబట్టి వారి జీవితాల నిర్ణయింప బడుతాయి, దానికి విచారం ఎందుకు? సంతోషం ఎందుకు?

'తలవ్రాత తప్పగా

తరమౌనా?

కలిమి లేములు వెదుక

వలనౌనా? '

అని శాస్త్రి తనలో తాను చాలాసేపు వితర్కించుకొని, ఇంట్లోకి వెళ్ళి, స్నానం చేసి, కేరియరుతో వచ్చిన భోజనం భోంచేసి, ప్రక్కమీద ఆలోచిసూ పడుకున్నాడు.

*　　*　　*　　*　　*

సాయంకాలం ఐదు గంటలయింది—

ఏదో ఆలోచిస్తూ, శాస్త్రి సావిట్లో అటూ ఇటూ, రెండుచేతులూ వెనక కట్టుకొని, తిరుగుతూ ఉన్నాడు. అంతలో 70 ఏండ్ల బ్రాహ్మణవృద్ధుడు, 20 ఏండ్ల వడుచుపిల్లతో తయారయ్యాడు.

'ఎవరుమీరు?'

'నేను హనుమంతరావునండి!'

'దయచేయండి—దయచేయండి'

అంటూ ఆనందం పట్టలేక—ఖంగారు పడుతూ రెండు కుర్చీలు చూపెట్టాడు_క్లయింటు దొరికాడుకదాఅని—

'హనుమంతరావుగారు-మనదేవుారు'

'వెంకటగిరి'

'మంచిది-ఆఅమ్మాయి గారెవరో అడగవచ్చునా?'

చల్లకొచ్చి ముంతదాస్తేలాభంఏముందండి! ఆఅమ్మాయి గురించివచ్చి, ఆఅమ్మాయి ఎవరో చెప్పకపోతే ఎలాగండి?'

'ఐతే శెలవు ఇవ్వండి'

'ఏంచెప్పమంటారు? ఆఅమ్మాయిగతి...'

'ఏదుంటే అదేచెప్పండి'

'పాపం-ఆఅమ్మాయి మామనమరాలండి'

'అహా దానికి పాపం ఎందుకండి- మీవంటివారికి మనుమరాలయ్యిందంటే-ఆమెకంటే అదృష్టవంతురా లెవరుంటారు?'

'ఆమె అదృష్టానికి మీదయవల్ల ఏమీలోటులేదుకాని-ఆఅదృష్టం, పరులహస్తగతం అయింది'

'అహ్హాహ్హా! అంతేనా అలాగైతే- మూడు నిమషాల్లో, ఆమెహస్తగతం చేయనటండీ'

అంటూ ఆమెవంక, ఒకక్రీగంట చూపు, గురిచూచి, విసిరాడు. ఆబ్రాహ్మణ వితంతువు తలమీద ముసుగుజారింది. కన్యగా ఉన్నపుడు, తుమ్మెద రెక్కలలాగ, మృదువుగా, నల్లగాఉన్న ఆమె నీలవేణి-కష్టవేణిలో స్నానార్థమైకాబోలు-

మంగళిక త్తికి గుఱై పోయింది. ఆమెముఖానికి-సన్యాసి ముఖానికి ఈషత్తు భేదంలేదు. ఏముంది?

ఇద్దరిగుళ్ళూ విభూతి పళ్ళు; శివలింగాలు;
శాస్త్రిమనసు కళుక్కుమంది—
ఎవరుమట్టుకు ఏం చెయ్యగలరు?

కలదుకదూ-మతం- మతంలో మమకారం—మమకారబద్ధులగు మానవబృందం—ఆ బృందం చేతిలో, జీవితసౌంధర్యాన్ని నాశనం చేసుకునే విధవ సంబంధం—

ఛీ. ఛీ. ఆమెజీవితం ఇంట్లో కోత-బయటరోత. పసిడి నిగ్గులుతేరే దబ్బపండువంటి శరీరకాంతి; పున్నమినాటి చందమామనుమించు ముఖలక్షణం పల్లవ సంపుటాలను మించుపాణిద్వయం.

ఏతత్ సౌందర్య ద్విగుణీకృతములైన అందచందాలన్నీ ఏమయ్యాయి?—

ఆమె అలివేణిని, అంట కత్తిరి వేయించటంలో, అంతరించారు. ఆమె వయో యౌవ్వన సౌందర్యం అడవి కాసిన వెన్నెలయింది. ఆమె జీవితసౌందర్యం, శాస్త్రాగ్నికి ఆహుతి అయింది.

ఆమె ఇప్పుడు—
పూవులులేని తీవ;
చివురించని కొమ్మ;
దానికి బాధ్యు లెవరు?

సత్యమెరుంగని—స్వార్థపరులు ;
మమతలువీడని—మతాధిపతులు ;
మతివిభ్రాంతిచెందిన—మఠాధికారులు ;
అభిమానహీనులైన—ఆత్మవంచకులు ;
ఎవరినంటే ఏముంది...?

మన చీకటికొట్టుకు తాళం మనం వేసుకుంటే, ఎవరేం చేస్తారు? ఎందుకుచేస్తారు?

* * * * *

'శాస్త్రిగారు మా కేసు అన్ని కేసులాగా చూస్తే వీలు లేదు'

'ఎన్నడూచూడను—' (అసలు మరొక కేసుఉంటేగా)

'ఎందుకంటే ఈమె దిక్కు—మొక్కూ— లేని వితంతువు. కాలంతీరి కాటికి కాళ్ళుసాచుకొన్న, నేను తప్ప మా అమ్మా యికి మరొక దిక్కు—లేదు. కాబట్టి మగ ఆసరాలేని మా అమ్మా యిని ఎలా చూస్తారో—'

'ఎంతమాట హనుమంతరావుగారు - మీకెంత బాధ్యత ఉన్నదో, నాక్లయింటు విషయంలో నాకుమాత్రం అంత బాధ్యతా ఉండదండీ! ఆమె కష్టసుఖాలన్నీ నావే... అలాకాక పోతే ఇంతపెద్ద పేరులోకి రాగలనా?'

'అలాగే, అటువంటి ఉదారస్వభావులు కాబట్టే మీ వద్దకు తీసుకురావటం'

'అసలు కేసేమిటి'

'ఏముందండి'

'ఏమీలేకపోతే మరెందుకు వచ్చారండీ!'

'ఏదోఉంది—అమ్మాయీ! ఆ కేసుసంగతి చెప్పు?'

'మా ఆస్తిలో కొంతభాగం, మా మారుటి అక్కకి వస్తుందని, మా బావగారు నామీద వేద్యంవేశారు'

అంటూ అమ్మాయి తనకథ ప్లీడరుగారితో ప్రారంభించింది.

'వారికికూడా హక్కుంటుందే అలాగైతే'

అన్నాడు పొరపాటున శాస్త్రి.

'మీరుకూడా అలా శలవిస్తే, మీదగ్గరకు రావటం ఎందుకండీ!'

అంటూ చులకనగా మాట్లాడేసరికి, అతడు సిగ్గుపడుతూ

'అబ్బెబ్బే! ఆమెకెలా హక్కుంటుంది? అంతామీదే!'

'అలాగంటే ఇలాగంటారు? మహా గొప్పగా ఉందే మీ తీర్పు'

'అలాకాదండీ—ప్లీడరన్నాడే, తలలు మార్చేవాడుగా ఉండాలి-అవునన్నది కాదని, కాదన్నది అవునని వాదించకపోతే వాడి గొప్పతనం ఏముంది!'

'ఐతే అబద్ధపు నిజావణా ప్లీడరు వృత్తి!'

'కాదామరి- కూనీచేసినవాడు ఫలానావాడని తెలిసినా వాడుకూనీ చెయ్యలేదంటాడు; వాడిమీద నేరం తప్పించి

వేస్తాం; కూనీ చెయ్యని అమాయకుని కూనీచేశాడని వాదించి, వాడికా స్త పాణాలు ఉరికంభంమీాద బలివేయిస్తాం; ఇది మా వృత్తి. లేకపోతే, మాప్లీడరు బోర్డులు దుమ్ముపట్టి, మావేరులు కనబడకుండా మాసిపోవ్రూ?'

‹అమాయకుల ప్రాణాలు తీయటంలో మీారు యము డంతటి వారన్నమాట'

‹యముడు అందరిపాణాలు న్యాయంగా, నిష్పక్ష పాతంగా తీసివేస్తాడు. మేమో? కేవలం అమాయకులని తెలి సిన వారి పాణాలుకూడా, న్యాయాన్యాయా విచక్షణలేకుండా తీసిస్తాం,

‹ఇదా మీా వృత్తి'

అంటూ ఆమె ఆక్షేపణగా, తలతిప్పుతూ, గడ్డం కింద వేలుపెట్టుకొని అంది.

'ఇన్నిచేసినా ప్లీడరుపని బయట పల్లకిలుమోత; ఇంట్లో ఈగలమోత. ఏమిచెయ్యమంటారండీ! దుమ్ముపట్టినబోర్డు దులప టానికి కూడా వీలుండదు. ఏమిచెయ్యాలి?'

'ఏమి చెయ్యమంటానా? 'రంగరంగా - శ్రీరంగరంగా' అంటూ నాలుగిళ్ళు ముష్టెత్తుతే, జీవితం సుఖంగా గడుస్తుం దంటాను'

'అమ్మాయిగారూ! పొరబడుతున్నారు, పొరబడుతు న్నారు. ముష్టివానికి దొరికేవి, తింటానికి-తిట్లే గుమ్మానికి ఒకటి చొప్పున; అంతేగాని, తిండికాదు. అన్నట్లు విన్నారో

లేదో ఈమధ్య శ్రీరామ్మూర్తిగారు ముష్టి సమస్య పరిష్కారం చేశారు'

'ఏమని'

'కనబడిన ముష్టివాళ్ళనందరినీ చంపమనీ. రామరామ, అంతఘోరమే! అయ్యో కలికాలమా! వారుమట్టుకి మనవంటి వారు కారూ! మానవజాతి అంతా ఒకటి కాదూ? పనిపాటలు లేక, బీదవాళ్ళై ముష్టెత్తినంత మాత్రాన్న వాళ్ళ ప్రాణాలు తీసివేయటమే...

అబ్బా! ఎంతఘోరం—ఎంతపాపం-ఎంతక్రూరం'

'చాలుచాలు. చాలాపదా లుపయోగించారు. ఇలాగే ఉందికాలం'

అంటూంటే ఆమెమళ్ళీ ఏదో లోకాభిరామాయణం అందుకుంది. దానితో అక్కడున్న హనుమంతరావు వళ్ళుమండి

ఛీ. ఛీ. ఈ ఆడవాళ్ళెక్కడుంటే అక్కడేసోది. రామాయణ మహాభారతాలన్నీ అక్కడే! పక్కింటి వెంకమ్మ గొడవ నుంచి ప్రళయాంతంవరకున్న సంగతులన్నీ అక్కడే. ఆడదానితో బయలుదేరినంత నగుబాటులేదురాబాబూ! అందుకనే అనుభవశాలి 'మూడుతలలుముడడవు' అన్నాడు.(ఆమాట విధవలకుకూడా తలలున్నపుడు సుమండీ)

అని అనుకుంటూ—

'అమ్మాయి శారదా! ఈగొడవలన్నీ ఎందుకు మనవని మనం చేసుకొని చక్కాపోదాం'

'సరే తాతయ్యగారూ అలాగే...

ప్లీడరుగారూ! అసలుసంగతి ఏమిటంటే-న్యాయంగా అక్కా-చెల్లెండ్రిద్దరకూ ఆఆస్తి వెళ్ళవలసిందే కాని. మా నాన్నగారు చనిపోయేముందు, రెండవ భార్యఅయిన మా అమ్మగారిమీద ప్రేమాతిశయాలతో, మాఅమ్మగారికి యావదాస్తి 40 వేలు వ్రాసి ఇచ్చారు.

'బాగుంది అదంతా ఆయన కష్టార్జితమే!'

'ఇంకానయ్యం చెమటూడ్చి గడించాడు. (బస్తాలు మోసో, నాగలుదున్నో ఆమెకే తెలీదులెండి)'

'అలాగైతే, మీఅక్కగారికి దమ్మిడీముట్టదు, యావదాస్తి మీదే...'ఆల్ రైట్' ఏవీ ఆకాగితాలు?'

అంటూ మహావీరుడ్లాగ చెయిచాచాడు.

ఆమె ఆకాగితాలన్నీ ఎంతోభక్తితో, ఆశతో చేతికందించింది——

అవి కళ్ళద్దాలలోనుంచి, తీక్షణంగాచూచి.... "Oh. I see. This is the point. My dear శారదా! వాళ్ళ తలలు మనచేతిలో ఉన్నాయి'

అంటూ చిరునవ్వుతో చెప్పాడు, ఆమె హృదయం ఉప్పొంగింది.

'నిజం'

'శారదా! బ్రహ్మవ్రాతకైనా తిరుగుంటుందిగాని, నా వ్రాతకు తిరుగులేదు. బృహస్పతిమాటైనా పోల్లు పోతుందికాని

నామాట పొల్లుపోవటానికి వీలులేక-అసలు నామాట జవ దాటటానికి, ఎవడికీ శక్తిలేదని ముందు తెలుసుందనుకో Alright మనం కేసుగెలిచినట్లు ఇవాళనుంచి లెక్క వేసుకోండి'

'చిత్తం-అందాకా ఫీజు, ఈఐదురూపాయలు తీసుకోండి'

అంటూ కోకచెంగున కట్టినినోటుతీసి, ఈయబోయింది. అలా కక్కుర్తి పడితే అతడిగొప్పతనం ఏముంది—

'శారదా! రాగికాణీవద్దు—(రూపాయలయితే కావాలి) నీముఖాం ఎక్కడ?

'ప్రస్తుతం, రావన్నగారి సత్రివలోనండి'

'ఎంతపనిచేశావు శారదా! ఆసత్రవసంగతి నీకెవ్వరూ చెప్పలేదు'

—'చెప్పారే'

'ఏమని'

'ఈఊరిలో చాలామంచి సత్రవ అని'

'ఇలాగే ఉంటుంది కాలం అనాధ అయిన అమదానిని చూస్తే అందరకూ అలాగే ఉంటుంది'

'ఏమండీ! ఏం అదిమంచిదికాదూ'

'ఇంకానయ్యం- ప్రాణాలతో బయటపడ్డారు. రాత్రివేళ కొందరుకౌడీలు తాగివచ్చి, తలలుపగలకొట్టి ఉన్నకాస్తా డబ్బు లాక్కుపోతారు...అదేమిటి ఈఊరిలో ప్రతీ సత్రవా అంతే'

'అలాగటండీ' అంద తలమీాదముసుగు సవరించుకొంటూ

మరి ఇంకెలాగనుకున్నారు. బాగాచేశారు. ఈవాళనుంచీ మీయిష్టం వచ్చినన్నాళ్లు మాయింట్లోనే ఉండండి. మీ కేసు పదిరోజుల్లో గెలిపిచ్చేస్తాను. మీకువచ్చే 40 వేలు పట్టుకొని మీయింటికి మీరు వెళ్ళవచ్చును'

అంటుంటే ఆమె అతనితో ఉంటానికి సంశయించి-

'ఎందుకండీ ప్లీడరుగారు మాఊరు మాత్రం ఎంతదూరం ఉంది? పూటప్రయాణం-వచ్చివెళుతూ ఉంటాం'

'దానికేమిటి-అలారావచ్చును-వెళ్ళవచ్చును. కాని కేసు గెలవాలంటే, మీసలహా ప్రతిక్షణం అవసరం. తరువాత మీ యిష్టం. ఏమంటారు తాతగారూ!

'అవును. మీరు చెప్పిందిబాగానే ఉంది. ఏమిటమ్మా శారదా! అక్కడైనా మనం ఇద్దరమేఉండాలి-ఆఉండటం ఇక్కడే ఉంటే, మనకేసూ గెలుస్తుంది; మన డబ్బూ ముదుతుంది; చక్కగా మనం పోవచ్చును. ఈ పదిరోజుల్లో చేసేదేముంది? కొత్తలుపొచ్చి ఇల్లెక్కుతాడా? కొత్తగోడలువచ్చి ఇల్లలుకుతుందా! ఏమంటావు చెప్పుతల్లీ?'

అంటుంటే ఆమె సంశయిస్తూ ఉంటుంది.

ఆసమయం చూచుకొని-పడిందిరా పిట్టవలలో అనుకొని సంతోషంతో—

'శారదా: మీయిల్లు ఒకటి; మాయిల్లు మరొకటీనా? దీనికి ఆలోజించాలా! పదిహేనురోజు లెంతలోరావు?'

'అంటుంటే ఆయనమాట తోసివేయలేకపోయింది. బస్తీ వాళ్ళకు మంచిచెడ్డలతో పనిలేదని వాళ్ళు వట్టిరౌడీలని ఆమెకు తెలిసినా ఆమాయ మాటల మత్తులో, మంత్రముగ్ధ ఐపోయింది.

'తాతా అలాగైతే ఉందామంటారా?'

'ఇంకా సంశయమా తల్లీ!'

'శారదా! మీతాతగారిమాట మామాట తోసివేయటం ధర్మమా!'

'సరే! మీయిష్టం'

శాస్త్రి హృదయపంజరంలో—ఆమె చిలుక;
అతని ఆకాశ హార్మ్యాలలో—ఆమెదేవత;
అతని ఊహాప్రపంచంలో—ఆమె భావగీతి;
అతని ప్రేమామృత వాహినిలో—ఆమె పూరేకుపడవ
అతని నందనోద్యానవనంలో—ఆమెమందారపూవు;
ఆమెయే అతని జీవిత సర్వస్వం—అయి పోతుందని ఆశించాడు.

శారద—శాస్త్రితో ఎలాజీవయాత్ర నిర్వహిస్తుందో! ఏమో! ఎదటి హృదయాన్ని తెలుసుకోలేం.

* * * * *

# 4

అది రావు బహద్దూర్ అప్పలస్వామి నాయుడుగారి భవనం...నాయుడుగారు కంటిమెంత నల్లకోటువేసుకొని, ఊదా అద్దాల కళ్ళజోడు, కోటుతోతుడుస్తూ, నిలువుటద్దంలో చూచు కుంటూ, తనకాకిరంగు పెద్దపెదాలకు తాను మురిసిపోతూ— చిరునవ్వు నవ్వుకుంటూ ఉన్నాడు.

వెనకాలే అతని భార్యా గవరమ్మ నిలబడి.

'ఏటి నాయుడుబావా! ఇయ్యాల మా ఉసారుగా ఉన్నావ్!'

'..............'

'మాటాడవే బావా!'

అంటూంటే కళ్ళద్దాలు పెట్టుకొని, అద్దంలో తన అంద చందాలను చూసుకుంటూ ఉన్నాడు.

'మాబాగున్నావోయ్ బావా...ఎంతబాగుంటేమట్టుకు నాతో మాట్లాడకోడదోయ్'

'ఉండే ఏదోసోకు సేసుకుంటుంటే నీవు సిరాకు పడితే నాపని పరాకై పోతాది'

'సిరాక్కేముందిగాని, ఈసింగారించుకుంటం ఎందుకో చెప్పకూడదు?'

'ఆఁ ఆఁ నీకు సెప్పకుండా నేనేటి దాశాను?'

'నేను 'పెసిడెంటు' నవుతున్నా నకదూ? అందుకని.'

‚ఎప్పుడో అయ్యే 'పెసిడెంటుగిరికి' ఇప్పటినుంచీ ఎందు కీసోకు'

సాల్లే నీకేటి తెలుసు. పెద్దపనుల సంగతులు తెలియ టానికి పెద్దోరితో ఏమన్నా తిరిగివా? ఏడిశావా? ఆటిసంగతి నానెరుగుదునుగాని, నీకేటి తెలుసు?'

పెసిడెంటుగిరికి పెట్టామంటే కూటికి నోసుకోకుండా తిర గాలి-ఊఁ-అంతుందిపని'

అంటూ అతిగర్వంగా చెప్పిన ప్రతిఅక్షరంలోను, నూత నోత్సాహం తొలుకాడుతూఉంది.

'అంత పెద్దపనంటావా!'

'మరింకేటనుకున్నావ్ పెసిడెంటంటే? హోలుమొత్తం జిల్లాకంతకీ పెద్ద నన్నమాట'

'ఐతే జీతం ఎంతుంటుంది?'

'జీతమా! అబ్బో సాలా ఉంటుందిలే'

'ఏటిసెయ్యాలబావా!'

'ఎన్నిదినాలు సెపితే తరుగుతుంది గౌరీ ఆపని. హోలు మొత్తం ఇస్కూళ్ళన్నీ నాసేతులోనే ఉంటాయి; కంట్రాక్ట ర్లంతా నాసేతులోనే ఉంటారు. అదేటి_ఇదేటి జిల్లాఅంతా మన సేతిలో ఉంటాదంటేనమ్ము'

అంటుంటే అతని కళ్ళల్లో మెరిసిన ఆశాజ్యోతిని అరప టానికి ఆబ్రహ్మకూడా తరము కాదనిపించింది. ఆతడు చెప్పే మాటలు వింటూ, రాబోయే గొప్పతనాన్ని ఊహిస్తూ,

కాబోయే ధనరాసులకు చింతిస్తూ; తన్మయంలో మునిగి పోయింది గవరమ్మ'

కాళ్ళకు కిర్రుచెప్పులు; కళ్ళకు ఊదా అద్దాలు; తలకు సైను తలపాగా; చేతిలో వెండిపొన్ను కఱ్ఱ. నాయుడుగారి ఆకారం చూస్తే సాక్షాత్తు విష్ణుమూర్తిలాగున్నాడు.

ఆ ఆకారానికి తానూ తనభార్యా ఎంతమురిసిపోయారో చెప్పలేం—

'ఇలా ఎందాకా నాయుడుబావా?'

'శాత్రి ఇంటి కెళ్ళొత్తా'

'అయితే వరే'

'బాగున్నానా—'

అంటూనవ్వుతూ ఆమె ముఖం చూచాడు.

అమెకూడా ఒకనవ్వు నవ్వేసింది-అదేజవాబు-

కోటినవమన్మధులు కూడి, అప్పనబాబు అయ్యాడా అన్నట్లు చూచుకుంది గౌరి.

అతడు గుమ్మం కదిలాడు ఠీవిగా—రాబోయే మహోన్నత దశ తలచుకొని—

8 గంటలయింది, నాలుగడుగులు వేశాడు.

అంతలో శాస్త్రి బిళ్ళగోచి లాల్చి-చొక్కా-తో బెంగాలీ వాడ్లా తయారయ్యాడు వెదుకబోయినతీవ కాలికి తగిలినట్లుగా అప్పన్నబాబుగా రెదురయ్యారు.

'నమస్తే నాయుడుగారూ నమస్తే'

అంటూ రెండుచేతులూ జోడించి అతివినయంగా నమస్కారంచేశాడు.

'నమత్తే శాత్రీ నమత్తే'

అంటూ శాస్త్రిని అనుకరించాడు.

'నాయుడుగారూ! ఉదయాన్నే ఎక్కడకు బయులుదేరారు?'

'మీదగ్గిరికే...రండి-రండి'

అంటూ ఇంట్లోకి దోవతీశాడు - వేసుకున్నా దసరా బుల్లోడివేషం అంతా పదిమందికీ చూపించలేదే అనేవిచారంతో.

ఇద్దరూ లోపలకు వెళ్ళి, హాలులో చెరొక కుర్చీమీదా కూర్చున్నారు.

'శాత్రి ఏటీ సంగతులు'

'ఏమున్నయి-మీరేచెప్పాలి'

'మనపెసినెంటుగిరి మాటేటి సేశావు?'

'తమరి ఇష్టంలో ఉంది. మొట్టమొదట మెంబరుగా స్టెండు కావాలి. తరువాత ఆమెంబర్లు ప్రెసిడెంటుని, వైస్ ప్రెసిడెంటునీ ఎన్నుకుంటారు. అప్పుడు ప్రెసిడెంటు పోస్టుకొరకు మీరు స్టెండు కావాలి'

'అద్దదీ-ఆలాచెప్పు. తరువా తేటి సెయ్యాలి'

'తరువాత ఏముంది. నలుగురు మెంబర్లకూ నాలుగు రూపాయలు పారేసి, మన పత్రిక్క తిప్పెయ్యాలి అలా చేస్తే ఈజిల్లాఅంతా మీచేతిలో ఉంటుంది'

'బాగుంది'

'నేను చెబుతున్నాను వినండీ నాయుడుగారూ డబ్బుకు మొఖం చూచుకోకుండా మొదట్లో రెండుచేతులా విరజిమ్మేశారంటే దానికి పదిరెట్లు డబ్బేకాదు-డబ్బుకుతోడు అఖండమైన విఖ్యాతికూడా లభిస్తుంది'

'డబ్బెట్లాగొస్తాది- శాస్త్రీ'

'అమాత్రం తెలీదండీ'

'సత్తెంగా తెలుస్తే విన్నడుగుతానా'

'డిస్ట్రిక్టుబోర్డు కంట్రాక్టరు లుంటారన్న సంగతి విన్నారా'

'ఆహాఁ అదివినకే ఇన్నాను'

'వాళ్ళకు కంట్రాక్టు లిచ్చామంటే బోర్డుడబ్బు గుప్పేస్తారు—ఇంకా స్కూళ్ళకు పుస్తకాలు పెట్టేటపుడు, జిల్లాలో పనులిచ్చేటప్పుడు...ఎన్నోవిధాల రెండుచేతులా డబ్బు గడించవచ్చు, ఏలాలేదన్నా మీాపదవి అయ్యేసరికి రెండుమూడు లక్షల రూపాయిలన్నా గడించవచ్చు'

'నిజం నిజం. శాస్త్రీ అంత డబ్బే'

'మరింకే టనుకున్నారు. ఇదివరలో ఎంతమంది ప్రెసిడెంట్లు అప్పులతో బయలుదేరి ఆస్తులు గడించలేదు. మేడలూ మిద్దెలూ కట్టలేదూ? పొలాలూ పుట్రా కొనలేదు?'

'ఆలాగటుండీ! అట్లాగయితే సాలా పెదగా దుందన్న

మాట'

'మరేమిటనుకున్నారు- లేకపోతే ఊరికే రంగంమీదకు రమ్మంటున్నా ననుకున్నారా?'

'సత్తెం సెప్పావ్ శాత్రి'

'అంతవరకూ ఎందుకండీ-'చైర్మన్'గావచ్చి లక్షలకు లక్షలు దోసివేసినవారిని ఎంతమందిని చూడటంలేదు ఒక town కు పెద్దగానున్న 'చైర్మన్' కే అంతలాభం వస్తే— ఎన్నో ఊళ్ళుకలసిన జిల్లా ప్రెసిడెంటుగారికి రావటానికేముంది'

'ఐతే నచ్చులు నచ్చులు సంపాదించొచ్చంటావ్?'

'ఇంకా సంశయమా?'

'ఎంతడబ్బెట్టినా, నట్టంలేదంటావ్?'

'ఏంనష్టం-పెట్టిందానికి పదిరెట్లు నాలుగునెలల్లో లాగేయమండీ-మనమేడ బంగారం మేడ చేసేయం'

'అయితే పెసిడెంటుగిరికి పెట్టమంటావా?'

'అది మీయిష్టం-డబ్బుకు వెనకాముందూ జంకకుండా ఉంటే కార్యరంగంలోదిగి, కాలికి గజ్జె కట్టండి'

'డబ్బుకేటిగాని, గెలుత్తానంటావా?'

'ఆ భారంనాది. మీమీద పూలవర్షం కురిపించే పూచీ నాది'

'పూలవరసమే'

'ఏమనుకున్నారు!'

'అయితే నంబరుగా ఎప్పుడు నిలబడమంటావ్'

'దానికింకా వారంరోజులుంది. రేపే కాకితాలు పంపాలి'

‘అయితే ఇపుడెంత కావాలి?’

‘ఆఁ ఎంతోనా ప్రస్తుతం ఒక వందచాలు. తరువాత ఎలక్షన్‌లో చూచుకుందాం’

‘అయ్యబాబు; వందరూపాయలే’

‘దీనికే జడిశారు...శెలవు...ఇంక మీ ప్రెసిడెంటు పదవికి మీకూ ఒక నమస్కారం’

అంటూ శాస్త్రి రుచిచూపి దాటబోయాడు. గేలాం చివరున్న ‘ఎఱ్ఱ’ రుచి చూచిన చేప తనప్రాణాలు పోతాయని తెలిసినా దానిని వదలగలుగుతుందా? కొంచం ప్రాణభీతి కల గ్గానే మాటువాడు, గేలాన్ని కొంచెం వెనక్కి లాగుతాడు. దానితోటి ఆకా స్తతీయని ఆహారం ఎక్కడ పోతుందోనని, ఆ చేప ఎఱ్ఱను మరింత గట్టిగా మింగుతుంది. ఇనపకొంకీ తవ ప్రాణవాయువులను మెలవేస్తుంది. మాటువాడు దాని ప్రాణాలు తీసివేస్తాడు.

అలాగే శాస్త్రి కొంచం కదిపేసరికి- ఎక్కడ తవ ‘ప్రెసి డెంటుగిరి’ పోతుందోనని ఖంగారు పడుతూ శాస్త్రి చెయ్యి పట్టుకొని-

‘శాస్త్రీ ఏటోయ్! అంతకోపం నేనేటన్నానని?’

అన్నాడు పాపం ఎంతో జాలిగా-బంగారపు సింహాసనం వదులుకున్న వాడిలాగ-

‘ఏమనాలి! వందరూపాయిలికే, గుండెకొట్టుకుంటుం ఆగి పోతే, రేపు సంచులకు సంచులు కోసెయ్యాల — డబ్బు కొందు

చేతులతో విరజిమ్మాలి- అటువంటప్పుడు మీ ప్రాణాలేపోతా యనుకుంటాను...'

'శా-శా-అదేటి!'

'ఛా. ఛా లేదు. ఛీ. ఛీ. లేదు ఒకటి చెబుతాను వినండి, 'డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు' అంటే సామాన్యంగావచ్చేది కాదు; సామాన్యులు ప్రయత్నించేదికాదు; అది బాగాడబ్బున్న వాళ్ళుమోతుబరులు, వెనుకపదిమందిఉన్నవాళ్ళుప్రయత్నించాలి'

'అః ఆః దానికేటి లోటోయ్. శాత్రి నాకింద ఎంత మందున్నారో నీకేటితెలుసు. నామిల్లునిండా పజలే'

'కాదనను. అయినా వెధవమిల్లుమీద ఏమి వస్తుందండి. ఒక్కరోజు ప్రెసిడెంటుగడించిన జీతం—మిల్లుగల ఆసామి జీవిత కాలం గడించలేడనుకోండి'

'సత్తెంగా!'

'మీతో అబద్ధం ఆడతానా?'

'అయితే ఉండు నోటట్టుకొత్తా'

నంటూ లోపలకు వెళ్ళి-భావిజీవితౌన్నత్యాన్ని తలుచుకుంటూ వందరూపాయల నోటు 'టపేలు' మని శాస్త్రిచేతికిచ్చేశాడు. శాస్త్రి కన్నులలో ఆశాజ్యోతి మెరుపులా మెరిసింది.

'నాయుడుగారి దర్జా ఎవరికి వస్తుంది'

అంటూ చిరునవ్వుతో నోటందుకుని జేబులోపెట్టి—

సెలవు. రేపే మిమ్మల్ని మెంబరుగా నిలబెడతా'

'ఊఁ కానియి యింక డబ్బుకు జంకితే ఆ ఏడుకొండల ఎంకటేసుమీాదొట్టు. ఆయనకు మొక్కేశాగా, నిలువుదోపుడి ఇత్తాగని'

'అయితే మనదిగ్విజయాన్ని బ్రిహ్మరుద్రులు ఏకమైనా ఆపలేరు...'

'అద్దదీ. అట్టాగను'

'మరింకేమనుకున్నారు—సెలవు'

అంటూ శాస్త్రి గుమ్మం దాటాడు. ప్రెసిడెంటయి పోయినన్నాసరదాలో భార్యా వద్దకువెళ్ళాడు, శెట్టి వెంగళప్ప మంచి అప్పన్నబాబు...

నిజానికి చదువుకున్న శాస్త్రికి—చదువుకోని భోగం దానికి తేడా ఏమిటి చెప్పండి?

శాస్త్రిచదువుకున్నపశువు-భోగంది చదువుకోని పశువు; శాస్త్రినెత్రివాళ్ళదగ్గర డబ్బులాగుతాడు. ఆమె విటులదగ్గర లాగుతుంది. శాస్త్రి నెత్రివాళ్ళ కొంపలు కూల్చేస్తాడు—ఆమె విటులకొంపలు కూలుస్తుంది. ఇరువురి జీవితాలు ఒకటేగా?

కాని ఒక్క విషయం నిజం—

శాస్త్రి:—విద్యాబలిపీఠంమీాద, తనయావదాస్తుబలిచేసి రిక్తుడై, నిరుద్యోగియై, కూటికిలేక మలమలమాడే పకీరు—

వేశ్య:—కాముకబలి పీఠంమీాద, తన యావ్వనరక్తం, బలిచేసి, రిక్తయై, పరాభూతయై, కూటికిలేక మలమలమా భగ్నజీవి.

ఇద్దరూ ఒకవిధంగా సన్యాసులే!—
అతడు యౌవ్వనంలో సన్యాసి అవుతాడు—
ఆమె వృద్ధాప్యంలో సన్యాసిని అవుతుంది అంతేభేదం.

* * * * *

## 5

'అదృష్టలక్ష్మి తనంత తా వలచివస్తే 'ఆఁ ఆఁ అసుంటూ ఉండు; అసుంటూఉండు మడి మయలై పోతుంది; దూరం దూరం అంటూ లక్ష్మీదేవిని వదల్చుకొని వచ్చే, మూర్ఖుడెవ డైనా ఉంటాడా 'సిరిరా మోకాలొడ్డు' మూఢులు కలరా? ఎంతవెఱ్ఱి'

వలపులాడి, తనంత తా వలచివస్తే చుల్కనగా చూచి హా! శ్రీహరీ! అంటూ ఓర మోమిడే ప్రవరాఖ్యునివంటి ఛాందసుడు— వెర్రిబాగులవాడు ఎవడుంటాడు? మహామహా కొమ్ములు తిరిగి, ఇనుప కచ్చడాలు కట్టుకొనే ముని ముచ్చులు కూడా, తామరస నేత్రలిండ్ల బంధాకాతారని, అల్లసాని పెద్దన గారు అనుభవం లేకే అన్నాడంటారా? అందాలు చిందే ఆడ దాని అరమోడ్పు కమ్నుల చిన్ని వెన్నెలకు ఖయిదీఅయి— దాసోహం చేయని మగవాడున్నాడంటారా? ఎవరిమట్టుకువాళ్లు గుండెమీదచెయివేసి, ఆలోచించుకుంటే తెలుస్తుం దీ విషయం.

ఇంతకూ కాంతా కాంచనాలకు లొంగనివా డెవడుం టాడోయ్ వెంకయ్యా!'

అంటూ శాస్త్రి అప్పలస్వామి డిస్ట్రిక్టుబోర్డు మెంబరు కోసం ఇచ్చిన 100 రూపాయిలలో 10 రూపాయలుపెట్టి 'బిస్కెట్ బ్రాందీ' కొని తాగుతూ, వెంకయ్యతో తనగొప్ప తనాన్ని ఏకరవుపెట్టటం ప్రారంభించాడు. వెంకయ్య శూద్రు డైనా, అటువంటి తాగుళ్ళన్నా, వ్యభిచారం అన్నా మహా అసహ్యం. ఎదటివారు కష్టపెట్టుకుంటారుకదా అని సత్యం మరుగుబుచ్చి, ఇంద్రుడూ, చంద్రుడూ, అంటూ పొగిడి డబ్బు గడించే దుర్మార్గుడు కాడు, సరేకదా అటువంటివారిని చూస్తే అతనికి చెప్పలేని అసహ్యం.

'శాస్త్రిగారూ! మీరు విద్యావంతులు; విజ్ఞానవంతులు, ఇటువంటి దుష్ప్రవర్తనల కలవాటుపడితే చెప్పేవాళ్ళెవరండీ'

'వెంకయ్యా! చెప్పేవాళ్ళుంటే ఇలాగెందుకు చేస్తానోయ్'

'ఆత్మనిగ్రహం-అత్యవసరం'

'అందుకనే తాగటం. పూర్వం మహాఋషులు తాగే వారు వాళ్ళంతా వెర్రివెధవలయ్యే నంటావా? వెంకయ్యా! తాగుడువల్లే కదోయ్ ఋషులు వేదాలూ, పురాణాలూ, ఇతి హాసాలూ వ్రాశారు? తాగుడువల్లేకదూ యూరోపియనులు తెలివి గలవాళ్ళయి మనలను పరిపాలిస్తున్నారు? 'యధారాజా తధా ప్రజా' అన్నారు. మనరా జెలాచేస్తే మనం అలాచెయ్యాలి'

'స్వేందాపులకు ఆంగ్లేయు డెలా రాజవుతాడండీ'

'ఇదొకటా! చాల్లే నె(రి వేదాంతం? అందుకనే గాంధీ Valueless అయిపోయాడు. గాంధీని కూడా రోజుకొక గ్లాసు బ్రాందీ పుచ్చుకోమను, ఎంత గొప్పవాడై పోతాడో! అప్పు డొక్క ఇండియానేకాదు, ఈమూడులోకాల్ని పరిపాలించే కృష్ణ మూర్తి అయిపోతాడు.'

'శాస్త్రిగారూ! బాగాచెప్పారుగాని, మీకూ కృష్ణు డంటే నమ్మకం ఉందండీ?'

'ఎందుకు లేదోయ్ వెంకయ్యా! అతడు సాక్షాత్తు అవ తార పురుషుడుకదూ! అతడొక్కడే భగవంతుడు'

ఐతే మీరు భగవంతుని నమ్ముతారన్నమాట?'

'అబ్బే! వేరేభగవంతుని ఎవ్వరినీ నమ్మనోయ్ ఒక్క కృష్ణునితప్ప'

'ఎందుచేతండీ?'

'అతడొక్క మహోపదేశం చేశాడు?'

'ఏమని...'

'వ్యభిచారం దోషంలేదని'

'ఇదా మీరు గ్రహించింది'

'నేనేమిటి-నాతో బి. ఏ. చదువుకొన్న ప్రతీవాడూ గ్రహించేది అది వెంకయ్యా! మీరు తెలీక పొరపడుతున్నారు. గాని, వ్యభిచారం వల్ల దోషం ఏముందోయి. మా కాలేజీలో చూడు, స్త్రీపురుషులం ఎంత స్వేచ్ఛగా తిరుగుతామో! అసలీ మాటకు మాకుపట్టుదలే లేదు.

వ్యభిచారమే పాపమైతే యూరపులో ప్రజలంతా నరకానికి పోవలసినదే స్వర్గం ఇండియాలో ఏకపత్నీవ్రతుల కొక్కరకుమాత్రం నిర్మించి, మిగిలిన ప్రపంచంలో మానవులందరకూ నరకం నిర్మించి విశాలభావాలుగల భగవంతుడు వెర్రివెధవవౌతాడంటావా? ఎంత పిచ్చోయ్ వెంకయ్యా నీకు'

అంటూ విరగబడి శాస్త్రి నవ్వటం ప్రారంభించాడు. దానితో వెంకయ్య వళ్లు మండింది.

'పంతులుగారూ అయితే తాగుడూ, వ్యభిచారం తప్పులేదంటూరు?'

'ముమ్మాటికీ...కాని కల్లుసారాయిలు మాత్రం తప్పు'

'ఎందుచేతండీ'

'అవి దొరలు తా రు—'

'ఐతే ఆంగ్లేయుల ఆచరణలబట్టి, ఆదర్శాలనుబట్టి స్వర్గ నరకాలు ఏర్పడ్డాయనుకుంటూ'

'ఇంకా సంశయమేమిటి? ప్రపంచంలో మూడువంతుల మంది వాళ్ళేకదోయ్. ఓటింగ్ పెడతే, భగవంతుడు వాళ్ళపక్షానే ఎన్నుకోబడ్డాడుగదోయ్.'

'అవును అందుచేతే కాబోలు, వాళ్ళు ఆడింది ఆట— పాడిందిపాటగా ఉంది'

'ఇంకేమిటనుకున్నావ్ వెంకయ్యా! భగవంతుడు వాళ్ళ పక్షాన్నుండబట్టే, వాళ్ళు మనలను పరిపాలిస్తున్నారు. విష్ణుమూర్తి తేజం మా ఆంగ్ల ప్రభువులో లేదంటోయ్'

'అదేలాగండీ?'

'ఎలాగేముంది నావిష్ణుః పృథివీపతి అని వినలేదూ; పృథివీపతి విష్ణువే అన్నా అర్థం నీకు అవగాహనం కాలేదూ? వట్టి Dunse లా మాట్లాడుతున్నావే?'

'శాస్త్రిగారి బ్రాంది మత్తులో ఆంగ్లసంపర్కంలో ఎదటి మనుష్యులను చాలా నీచంగా చూస్తున్నారన్నా సంగతే మరచి పోయినట్లున్నారు'

'అహ్హాహ్హా! వెంకయ్యా! నీకు కనబడే వాళ్ళంతా మనుష్యులనే నీఉద్దేశం. Sub-normal Humanity ని వట్టుకొని Humanity అంటావే వట్టి Uneducated Brute లాగ... ఎవడికైనా మానవత్వం రావాలంటే, వాడు at least B. A. ఐనా Pass కావాలి—లేకపోతే వాడు True citizen కాలేడోయ్!'

అంటూ లెక్చర్ దబాయించేసరికి వెంకయ్య వళ్లు మండింది. అతని ఆంగ్లాభిమానం ఈ ఆంధ్ర హృదయాన్ని అగ్నిజ్వాల క్రింద ఆహుతిచేసేసింది. స్వదేశాన్ని నిందించటం పరదేశాన్ని నుతించటం—ఏదేశాభిమానీ సహించలేడు. మహోజ్వలమై కరుణమై భారతవీరుని హృదయపాత్రిలో 'చలచలా' మరిగే 'రక్తచందనాన్ని' పరదేశ మాతృపాదాలకు, లత్తుక రంగుగా పూతపూయలేడు దాస్యంతో పరిదగ్ధమయ్యే అతని అశ్రుపాత్రిను ఆంగ్లమాతకు అభిషేకం చేయలేడు.

వెంకయ్య శూద్రుడైనా శాస్త్రిలాగ త్రాగుబోతు; వ్యభిచారి; అభిమానహీనుడూ కాడు. ఎండవేడిమికి భూమిబీటలు వారినట్లు అతని ధాటికి ఇతని హృదయం బీటలు వారింది. కోపాగ్నిని చల్లార్చుకోలేక లేచి—

'శాస్త్రిగారూ! మీ విజ్ఞానానికి, మీ దేశాభిమానానికి, చాలా సంతోషం. మీ విజ్ఞాన చంద్రికలను నాలుగు మూలలా వ్యాపింపచేయక, తమరి ముఖకమలంలోనే దాచేయండి. వెలికి పొంగనిచ్చి, భారతభూమికి తీరని మచ్చ కల్పించకండి'

'ఏమిటీ తెలివి తేటలు?'

'మీలాగ మాకు తెలివితేటలుంటే ఎపుడో స్వరాజ్యం వచ్చేది'

'ఓరిపిచ్చివాడా! స్వరాజ్యం అంత తేలిగ్గావస్తే దాని మీద తీపె ముంటుందిరా?'

'అయితే తమరంతా కలిసి చాలాబరువుగా తీసుకరండి' అంటూ అక్కడొక్క క్షణం ఉండకుండ బయలుదేరి, యింటికి వెళ్ళిపోయాడు.

శాస్త్రి నిర్ఘాంతపోయాడు.

'ఓరి, శూద్రప్రువెధవా! ఎంతవాడవు ఎంతయ్యావ్. ఇటువంటి వెధవసంకుచితమైన 'Mentality' (మెంటాలిటి) ఉండబట్టే, ఇలా తిండీ తిప్పలూ లేకుండా ఏడుస్తున్నావు.

పోరా వెంకయ్యగా, ఎవరికర్మకు ఎవరు కర్తలు నీనొసట దరిద్రరేఖలు' బ్రహ్మదేవుడు గట్టిగా వ్రాస్తే ఎవడు చెరుపుతాడు?'

అంటూ అతిగర్వంగా లేచి; తనవలపు వలలో పావురాయిలాగ బంధింపబడుతూఉన్న శారదవద్దకు వచ్చి—

‹సోజా! సోజా రాజకుమారీ సోజా'

అంటూ విజలు వేస్తూ, రూపదాల్చిన నవకోటి మన్మధునిలా తయారయ్యాడు.

కాంతా కాంచనాలకు అధినాధుడు కావాలంటే శారదను వలలో వేసుకోవాలి; శారద ధనాన్ని అహుతి చేసుకోవాలి, అప్పుడు కేవలం ‹గోపాలకృష్ణుడే' ప్రపంచం అంతా బృందావనమే!

   

## 6

రాత్రి తొమ్మిది గంటలయింది—

భోజనానంతరం, నల్లమందు బిగించి హనుమంతరావు మేడక్రింద సాటల్లో, గుమ్మాని కాపలా అన్నట్లు, కేంప్ కాట్ మీద పండుకున్నాడు. పండుకొన్నవాడు మళ్ళీ ఏ అర్ధరాత్రో లేవకుండా, నల్లమందు, కేంపుకాటు పడక, మొదలైన సుఖాలు అలవాటు చేశాడు లెండి, శాస్త్రిమహాశయుడు.

మేడక్రింద తాత—

మేడమీద మనమరాలు—శాస్త్రిలోనకా.

ఇదంతా కలియుగ ధర్మం లెండి—

మేడమీద శాస్త్రికి అతిభక్తితో, సున్నం రాసిన తమలపాకులకు ఈనెలుతీస్తూ, చిలకలుచేస్తూ — ఒక్కొక్కటి చేతికి పేనుబెత్తం కుర్చీలో కూర్చుని అందిస్తుంటే; అతడు ఎలక్ట్రిక్ లైటుకింద పడకకుర్చీలో పండుకొని, సగర్వంగా అందుకుంటే; ఆమధురసన్నివేశాన్ని చూడటానికి సిగ్గులేని గాలి దేవుడు మాత్రం కిటికీ సందులలోనుంచి తొంగిచూస్తూ ఉన్నాడు.

శారద వచ్చినప్పటినుంచీ, శాస్త్రి 'హోటల్లో' భోజనం మానేసి, ఇంట్లో శారదచే వంట మొదలు పెట్టించాడు. శాస్త్రి తనకేసు, సొంతకేసులాగా చూసుకొని, బాగాపని చేస్తాడుకదా, అనే ఆశతో. ఆమె శ్రమనక, చెమటూడ్చి కష్టపడి చక్కడి వంటలు తయారుచేసి, అతని అనందానికి పాత్రురాలైంది.

'శారదా! నిమ్మకాయి పులిహోర ఎంత చక్కగా చేశావు!'

'మీరెప్పుడూ అలాగే పొగుడుతారు'

'వట్టినే పొగడుతానా? నీలో అటువంటి ఆకర్షణీయ మైనగొప్పగుణం ఉంది...పులిహోరకేంగాని, ఆకొబ్బరి పెరుగు పచ్చడి; ఆవపెట్టిన అరిటికాయ; కందికట్టు; అబ్బా! తలుచు కుంటుంటే నానోట్లో, నీరింకా ఊరుతుంది' ఇంతచక్కటి పాకా లెక్కడ నేర్చుకున్నావు శారదా!'

'మా అమ్మగారి దగ్గరే'

'మీ అమ్మగారు అంత ప్రజ్ఞాశాలురన్నమాట'

'మరేమిటనుకున్నారు?'

'అలాగా!'

'మరింకెలాగః?'

అంటూ ఆమె హృదయంలో పొంగి పొరలిన ఆనంద రేఖలు, ఎఱ్ఱని పెదాలపై మల్లెమొగ్గల్లాగ, తొంగి చూచాయి. ఆమె చిరునవ్వుతో అందిస్తుంటే - పాపం మైమరచి కాబోలు— తమలపాకుల నందుకుంటానికి బదులు ఆమె చేయినందుకున్నాడు ఆమె శరీరంనిండా విద్యుల్లతలు (Electric waves) ఎగ్రబాకాయి. ఆమె హృదయం శరవేగంగా కొట్టుకుపోయింది. ఆమె చలిత నయనాలతో తన చేయి లాక్కోపోయింది. కాని, అతడామె చేయివిడలేదు. వంటరిగా చిక్కినవనితను, వదలిఉంటానికి అతడేమన్నా మహాత్ముడా!

'శారదా!'

అంటూ ఆమె కన్నులలోకి తీక్ష్ణంగా చూచాడు.

'శాస్త్రిగారూ! ఇదేమిటిది...!'

అంటూ భీతకురంగ నయనాలతో దీనంగా ప్రశ్నించింది.

'శారదా! అలా బెదిరిపోతావెందుకూ! నేనేమయినా భూతాన్ననుకున్నావా? ఈడూజోడూ గలవాళ్ళం; జంకూ గొంకూ లేకుండా స్వేచ్ఛగా, ఆనందంగా, ఉండాలి కాని ఇలా ఖడ్గమృగాన్ని చూచినట్లు కంగారు పడతావెందుకు?'

'శాస్త్రిగారూ!'

'ఇంకాభయం పోలేదు శారదా! ఇలారా నీ భయం నిముషంలో పోగొడతా'

అంటూ ఆమెను తన హృదయంపైకి లాక్కొన్నాడు.

ఆమె పెదాలు వణికాయి; బలవంతంగా అతని బాహు బంధనంలో నుంచి తప్పించుకొని—

'శాస్త్రిగారూ! ఇలాచేయటం మీకు ధర్మంకాదు. ఇలా కామోద్రేకులౌతారని అనుకుంటే, నేనుమీతో ఇంత చనువుగా మాట్లాడుతానా? క్షమించండి ఇంక నాజోలికి రాకండి, ఇంత స్వేచ్ఛగా ఉండటం నాదేతప్పు.'

అంటూ ఆ అసాయుకాలు, అతని బాహుబంధం విడిపించుకోపోయింది. అతడు విడువక మరీమోటుగా అతని హృదయానికి హత్తుకోపోయాడు.

'శాస్త్రిగారూ! ఇది అధర్మం, అన్యాయం; అక్రమం; బలవంతం మహాపాతకం...'

'కాదు శారదా! దీనిలో ఏమీ పాతకంలేదు; ఇది బలవంతంకాదు;...నేను నిన్ను...'

'బలవంతం......'

'కాదు—'

'మరీ దౌర్జన్యం ఏమిటి?'

'ఇది దౌర్జన్యం కాదు శారదా! ఇదంతా నిర్మలప్రేమ'

'ప్రేమా...శాస్త్రిగారూ ....ఇది ప్రేమా... నీయందను రక్తకాని స్త్రీని బలవంతం చేయటం ప్రేమా? ఇదేనా నిర్మల ప్రేమ? ఈ ప్రేమ తత్వాన్నేనా మీరు నేర్చుకుంది?'

'అవును...నీకు తెలియక పొరబడుతున్నావు. దీనిని ప్రేమకాదని అంటానికి ఆబ్రహ్మకు తరముకాదు. తుదకా బ్రహ్మనుపుట్టించిన దేముడుకూడా తరముకాదు. నేను నిన్ను ప్రేమించాను, రేపు పెండ్లికూడా చేసుకుంటాను'

'ఓహో! శాస్త్రిగారూ! మహాశయా! మీ ప్రేమతత్వం బాగా తెలిసింది. నాకు పెండ్లిఅయింది- పెడాకులు అయింది—'

'అహ్హహ్హ! అయితే ఆ పెడాకుల సంబంధానికి విడాకులు ఇచ్చేసెయ్యి. మనమిద్దరం నూతన దంపతులౌదాము'

అంటుంటే ఆమెకు కోపం ఆగలేదు. తన శక్తికొలది అతడ్నితోసివేసి, తలుపుతీసుకొని పారిపోదామనుకుంటుంది.

గబగబా కొదమసింగపు గృహానుండి తప్పించుకొని పారిపోయే, భీత హరిణేక్షణిలాగ, ఆమె బయటకు పారిపోబో యింది. కాని అంతకుముందే ప్రతీతలుపు వేసి ఉన్నసంగతి అమా యకురాలగు ఆమెకేం తెలుస్తుంది-

వేసిఉన్న తలుపులను చూచిన ఆమెకన్నులు, చేపల్లాగ చెదిరిపోయాయి. ఆమె శిరసులో ప్రళయస్రవంతి ప్రవిస్తూఉంది ఆమె మ్రోడు కొమ్మలాగ నిలచిపోయింది

ఆమె వద్దకు నవ్వుతూవచ్చిన శాస్త్రి ముఖంలో ఎంత విషం తొలుకుతూ ఉన్నదో ఊహించలేము.

'శారదా! పంజరంలో బంధింపబడిన చిలుక పంజరపు

ఊసలను తెగకొరికి పారిపోలేదు. సింహముకూడా బంధింపబడితే బోనులోనుండి ఈవలకు రాలేదు.

తెలిసిందా శారదా! నీవు నన్ను తప్పించుకొని బయటకు వెళ్ళలేవు. దీంట్లో అధర్మంకూడా లేదు. రష్యా మొదలగు పర దేశాల్లో చూడూ—ఒక స్త్రీని ఎందరో పురుషులు అనుభ విస్తారు. ఒకపురుషుని ఎందరో స్త్రీలు అనుభవిస్తారు దాంట్లో తప్పంటే వారంతా నరకానికి పోవలసిందేనా? వాళ్ళల్లో తెలివి గలవాళ్లు లేకే అలాచేస్తున్నారంటావా!

పిచ్చిదానా-ఇవన్నీ తాదాత్మికపు సత్యాలు.(Relative Truths) వాళ్ళు స్వాతంత్ర జీవులెందుకయ్యారు? ఇటువంటి విశాలభావాలున్నయి కాబట్టే; వారు నాగరికులు (Civilised People) ఎందుకయ్యారు; ఇటువంటి ఆదర్శప్రాయమైన ఆచరణ లుండబట్టే—తెలిసిందా.... ఏమిటి?

'బాగా తెలిసింది...ఐతే వ్యభిచారం దోషంలేదంటారా

'అలా అడుగు జవాబు చెపుతా'

శారదా! ఈప్రపంచంలో వ్యభిచారం ఎంతమాత్రం తప్పుకాదు. అనలు వ్యభిచరించటం అంటే ఏమిటో అర్ధంగాక ఈవెఱ్ఱి హిందూదేశం ఖంగారు పడుతుంది....

వ్యభిచరించటం అంటే మనమనసు మరొక వస్తువుమీద గాని, మరొకవ్యక్తిమీదగాని, వ్యాపించటం మన మనసు నిమ షానికి వేయిసార్లు ఎన్నోవిషయాలమీదకు పోతుంది. అన్నివిష యాలలోనూ మనసు వ్యభిచరించినట్లే—

కాబట్టి వ్యభిచారం దోషం అయితే మనమీ ప్రపంచకంలో ఒకనిమిషంకూడా ఉండలేము. మనమనను వ్యభిచరించకుండా ఒక్కక్షణం ఉండలేదు.

వ్యభిచారం చేయంది ఒక్క శవమే...బతికి చెరించే ప్రతివ్యక్తీ వ్యభిచారంచేస్తుంది...తప్పదు ముమ్మాటికీతప్పదు'

'శాస్త్రిగారూ! మీరు చెప్పేవిషయం నాకేమీ బోధపడటంలేదు'

'అవును...ఆవిషయం చాలా ఇంగ్లీషు పుస్తకాలు చదివితేనేకాని అర్థంకాదు. ఒక స్త్రీతో కేవలం విషయ సుఖాలు అనుభవిస్తేనే వ్యభిచరించినట్లు కాదని; ఈమన్మాత్రం మనసులో తలుచుకుంటే చాలు; వ్యభిచారం చేసినట్లేనని; భగవంతునితో సమానుడైన ఏసుక్రీస్తు చెప్పాడు. నిజానికి యావ్వనంలో ఉన్న పురుషుడు-యావ్వన సౌందర్యవతిని చూస్తే మననులోనైనా...'అబ్బా! ఎంతబాగుంది....చాలాచక్కగా ఉంది' అని ఒక్క నిమిషంఅన్నా అనుకోకుండా ఉండలేడు...అలాగే చక్కటి పురుషుని చూచినా స్త్రీకూడాను...'

కాబట్టి శారదా! ఈప్రపంచంలో వ్యభిచారం చేయని స్త్రీపురుషులుండరు'

'ఐతే అంతా తప్పు చేస్తున్నారన్నమాటే'

'అదే నీవెఱ్ఱి! అందరూ పిచ్చివాళ్ళనుకుంటం మన మూర్ఖం....'సత్యం వదామి'—'ధర్మం చరామి' అనే సూత్రా

లను ప్రపంచం అంతా ఆమోదించింది. వాటినే నిజంగా ఆచరించాలి. అంతేగాని వ్యభిచారానికి జంకకూడదు'

'సత్యం పలకాలన్నారు. మంచిది—ఐతే నాతో ఉన్నట్లు మీరు లోకానికి దాచకుండా చాటగలరా?'

'తప్పక....ఎందుకు? నిన్ను పదిమందిలో పెళ్ళిచేసుకుంటాను'

'అది తప్పితే అధర్మమే కదూ'

'అవును—అధర్మమే'

ఆమెకు తరువాత ఏమి చెప్పాలో తెలియలేదు. ఆమె జీవచ్ఛవంలాగ అయిపోయింది—

అతడు దగ్గరకువచ్చి ఆమె చెయి పట్టుకున్నాడు.

ఒక విషసర్పం నోటిలో ఆమెచెయి ఇరుక్కుపోయినట్లయింది.

'శారదా' అప్పుడేకాసిన వెన్నెలలాగ, నీయౌవ్వన సౌందర్యం అంతా నిష్ప్రయోజనం చెయ్యక. బుగ్గిపాలైన పన్నీరులాగ, నీ ప్రేమామృతాన్ని పాడుచేయక, రా శారదా! రా! నాజీవితసర్వస్వం నీకు ధారపోస్తా నిన్ను నాజీవిత పల్లకిపై కూర్చుండపెట్టి, మిన్నునుముట్టేటట్టు ఊపుతూ, ప్రేమగీతలు పాడుతూ, ఆనందోన్మాదినిగా చేస్తాను...'

రా! శారదా! రా! పవిత్రమయిన కాస్తకాలం పాడు చెయ్యక పోయిన రెప్పపాటుకాలంకూడా మనం గడించలేం— ఆలోచన్లో కాస్తకాలం వృధాచేయక.'

అంటూ ఆమెను తనదగ్గరకు తీసుకున్నాడు ఆమె తడబడే పెదాలతో—

'శాస్త్రిగారూ! నాజీవితం నాశనం చెయకండి. ఒంటరి దాన్ని చేసి నాసౌశీల్యం మంటగల్పకండి. మీకు మీ పెద్దలకూ వెయివేల నమస్కారాలు- నన్నువదలండి!'

అంటూ ఆమె అతనికౌగిలిలోనుంచి తప్పించుకోబోయింది కాని--కామాంధుడు—మదోన్మత్తుడు—తాగుబోతు— ఒంటరిగా చేజిక్కిన ఆడదాన్ని విడువగలడా? విడిచే అంత విజ్ఞానమే ఉంటే, ప్రపంచకం బాగుపడదూ!

'శారదా! నీహృదయం నాది. నీజీవితం నాది. నిన్ను నాశనంచేస్తే నన్ను నేను నాశనం చేసుకున్నట్లే'

అంటూ ఆమెను తనబాహువల్లరులలో గట్టిగా బంధించాడు. ఆమె వేడినిట్టూర్పులు అతని ఉచ్ఛ్వాస నిశ్వాసలు, ఆహ్వానించాయి. ఆమె తీవ్ర హృదయ స్పందనాన్ని, అతని హృదయ స్పందనం ఓదార్చింది ఆమె చెదరిపోయే కన్నులను మూసివేయకుండా ఉండలేపోయింది...

అతడామెను విడువలేకపోయాడు—

చీకటి ముసుగు వారిరువురిని, పాపపటలం క్రమ్మినట్లు క్రమ్మింది...కిటికీప్రక్కనున్న చెట్టుమీద పక్షి కలతపొందింది- మోహపిశాచం రెండుచేతులనెత్తి వారిని 'శీఘ్రమే నాశనమస్తు' అని దీవించింది-వారివినాశానికి దరిద్రదేవత పునాదులు త్రవ్వింది. ఇంకవారి జీవితసౌధం కూలకుండాఉంటుందా?

# 7

రెండు నెలలు గడిచాయి—

ఎలక్షను అయింది—

అప్పన్నబాబుగారు అయిదువేలు ఖర్చుపెట్టి 'డిస్ట్రిక్టు బోర్డు మెంబరు అయ్యాడు' ఆ ఐదువేలలో మూడువేలు శాస్త్రి గుటకాయిస్వాహా చేశాడు.

తరువాత ప్రెసిడెంటుపదవికి పెట్టాడు.

అతనిదే (Party) పార్టియో తెలుసునాఅండి?

పేరుమోసి, ప్రఖ్యాతి వహించిన 'JUSTICE' పార్టీ'

న్యాయానికి, సత్యానికి. నిలబడిన 'జస్టిస్' పార్టీ ఆయనకు వ్యతిరేకంగా ప్లీడరు శర్మగారు, కాంగ్రెస్ పార్టీతరఫున పోటీకి నిలబడ్డాడు.

శర్మ విద్యావంతుడు, సద్గుణసంపన్నుడు; ధనవంతుడు ప్రఖ్యాతపురుషుడు; ప్రెసిడెంటుపదవికి అన్నివిధాల పనికివచ్చేవాడే...కాని కాంగ్రెసుతరఫున నిలబడ్డాడుకాబట్టి డబ్బు లంచం ఈయకపోతే మెంబర్లు తమ ఓట్లు వేయరుకాబట్టి అతని ప్రెసిడెంటు పదవికి చాలాకష్టపడితేనేకాని దొరికేటట్లులేదు.

ఇంక మన అప్పన్నబాబుగారిదో— శర్మకున్న విజ్ఞాన విషయాలేమీ లేక పోయినా, రెండుచేతులా డబ్బుని ఇరజిమ్మి

వేయటానికి, ఈపన్మాత్రం వెనకంజ వేయటంలేదు. ప్రెసి డెంటు అయితీరాలి; దానితో కోటీశ్వరుడై పోవాలనుకున్నాడు.

**15 రోజులు గడిచాయి—**

ఇంకొక 15 రోజులు మాత్రమే ప్రెసిడెంటు ఎలక్షనుకు టయిముంది. శాస్త్రి రాత్రింబవళ్ళు అప్పలస్వామి ఎలక్షను నిమిత్తంతీసుకొన్న మేడవద్ద ఉంటున్నాడు. శాస్త్రితోపాటు ఏభై, అరవై మంది ఉంటున్నారు. వారందరికి భోజనాది సదుపాయా లన్నీ అప్పలస్వామే చూస్తున్నాడు. ఇరవజను Pleasure Cars ప్లెఝర్ కార్స్ పైగా అతడు ఉపయోగిస్తూ ఉన్నాడు. సంచులకు సంచులు తెగకోస్తూఉన్నాడు.

ఆరోజు ఆదివారం. తెల్లవారుఝామున 3 గంటలయింది. కారు, అప్పలస్వామి ఎలక్షను నిమిత్తం తీసుకున్న మేడ వద్దే ఆగింది. శాస్త్రి త్వరత్వరగా కారుదిగి—

'నాయుడుగారూ! నాయుడు గారూ!'

అంటూ లోపలకు వచ్చాడు అప్పలస్వామినాయుడు గారు ఖంగారు పడుతూ—

'శాస్త్రీ వచ్చావా! నరసయ్య మా టేటయింది? ఒప్పుకున్నాడా?'

'...............'

'ఏటి శాస్త్రీ సెప్పేయి. నామనసో పెరపెరనాడిపోతుంది.

'...............'

'పండో. కాయో, మొదట సెప్పేయవయ్యా! మన సాగటంనేదు—తరువాత ఇంపరిమేసను (Information) అంతా ఇద్దువుగాని'

'ఉండవయ్యా! మహాశయా!'

'ఇందాకడ్నుంచి ఉన్నాకదయ్యా!'

'సరే'

'అయితే ఏటయింది? పనిజరిగిందా?'

'జరిగింది'

'పండేనా? ఆఁ'

'ఆఁ...పండే'

'పండే—పండే...సెబాస్ శాస్త్రీ - సెబాస్ నీనాటో శాక్కుడుంటే సాలదోయ్-కడుపునిండిపోతాది, యదవ తోక్కా క్కటి నేదన్నామాటేగాని, సాచ్చాత్తు అనుమంతుని అంతటి వాడవుకదోయ్'

అంటూ అతడు పొందినఉషాదు వర్ణించలేము స్కూలు ఫైనల్ పరీక్ష మూడోసారి పాసయిన విద్యార్థి మనసులా గుంది అతని మనసు'

ఎంతోకష్టపడినవాడ్లాగ శాస్త్రి నాలుగు నిట్టూర్పులు విడిచి, చేతిరుమాలుతో ముఖం తుడుచుకుంటూ నెమ్మదిగా-

'నాయుడుగారూ- ఒక్క నరసయ్యేకాదు; రామారావు కూడా ఒప్పుకున్నాడు'

'ఏటీ-రామారావే!'

'ఆఁ మరేమనుకున్నారు?'

'ఎంకటసుబ్బయ్యకూడా కలిస్తే మాఁబాగుండేది'

'ఇంకా కలవలే దనుకున్నా రేమిటి? వెంకటసుబ్బయ్య కూడా మనవైపే'

'అద్దదీ; అద్దదీ అలాసొప్పు. ఆపచ్చాన పెసిడెంటుగిరి మనదన్నమాఁటే'

'మనదే... కాని.'

'ఇంకా అబ్జివను (Objection) ఏటోయ్ శాస్త్రి'

'అబ్జక్షన్ ఏమీలేదు...కాని...'

'మళ్లా కానీ అంటావేటీ'

'ఏమీలేదు...కాని'

'బాబు! సెప్పవోయ్! సంపక'

'అయితే చెపుతావిను'

'ఊఁ సెప్పు'

'ఇప్పుడు ఎంక్షను మంచిపోటీమీద ఉంది మెంబర్లంతా కాంగ్రెసుకే వేస్తానంటున్నారు'

'బాగాఅన్నావయ్యా! సావుకబురు సల్లంగా సెప్పినట్టు, ఈ సంగతి సెప్పడానికా, ఇంత తటమటాయించావు'

'అబ్బా! వినవయ్యా!'

'ఇంకేటినేది - నాయుడం ఒక్క పక్కనుంచి అంతా కాంగ్రెసుకు ఓటిత్తుంటే - మనపని గంగపాలే'

'అబ్బా వినవయ్యా అంటూంటే, ఇంక మాట్లాడితే నేను సంగతులు చెప్పలేను'

'సరే-సెప్పు'

'ఏమిటంటే-కాంగ్రెసు పక్షాన్న ఓట్లు వేస్తానన్నా పెద్ద మనుష్యుల నందరినీ మనవైపు తిప్పేశాను'

శబాస్-శాస్త్రి సెబాస్'

'తిప్పేయటంలో అల్లా ఇలానా ఎలక్షను అయ్యేవరకు మనం ఎక్కడుండమంటే అక్కడుంటారు. స్వయంగా మన ఎదుట మనకు ఓట్లు వేస్తారు'

'సత్తెంగా'

'ఆఁ దాంట్లో అబద్ధం ఉంటుందా'

'అఁ ఆఁ ఎందుకుంటుంది. అయినా అబద్ధమాడేదాక మీ కేటిగాచారం'

'నా హృదయం బాగా గ్రహించారు. ప్రజాసేవచేయటమే నాకర్తవ్యం కాని-అబద్ధాలాడి డబ్బుగడించటం కాదు. అలా అబద్ధాలాడి డబ్బుగడించే పక్షంలో. ఈపాటికే వేనకు వేలు సంపాదించేవాణ్ణి'

'సత్తెం...నా నెరగనటోయ్ శాస్త్రి'

'ముఖ్యమైన పదిమంది మెంబర్లనీ మనపక్షాన్న ఓట్లు వేయించేటట్లు చూడాలంటే'

'ఏటిసెయ్యాలి—'

'ఇంకా తెలీదు....ప్రపంచం అంతా దేనికి స్వాధీనం అవుతుంది'

‹ఆడదానికి'

‹ఇంకా'

‹డబ్బుకి'

‹ఆఁ—ఆఁ డబ్బే రెండుచేతులా ఇరజిమ్మాలి. సంచులు సంచులు తెగకొయ్యాలి'

‹అదానంగతి...నంచం ఇయ్యాలంటావు'

'మరిమీరు ప్రెసిడెంటుగా రావాలంటే లంచం ఈయక తప్పుతుందా?'

‹ఎంతిమ్మంటావు'

‹మీకు తెలీదా'

‹నాకేటి తెలుసు...నీవెంత సాపుతే అంతేగా సుమారు ఎంత ఇవ్వవలసిఉంటుంది'

‹మనిసికోశ 400 నేశ 500'

‹ఇంతే—'

‹అంతకాకపోతే ఒక్కొక్కరికి ఒకోఎయ్యి అనుకో'

‹అహ్హాహ్హా! బలేవాడవయ్యా! అంతతేలిగ్గా మెంబర్లను కొనసేద్దామనే నీఉద్దేశం'

‹ఎయ్యేశంటేనా! ఆఁ'

‹ఏదో వెయ్యి-వెయ్యి పారేసి ప్రెసిడెంటుపై పోదావనే'

‹మరేటికావాలో సెప్పవయ్యా!'

‹నేను చెపుతున్నాను వినండి. ఒక్కొక్కళ్ళకు 5 వేలు ఇస్తేనేగాని లాభంలేదు.'

'ఏటీ! ఐదేలే'

'అంతకుతక్కువైతే ఏమీలాభంలేదు'

'పోనీ మూడేసిపలైనా సూసుకోవయ్యా! నీకు పున్నెం ఉంటాది'

'సరే...అంతపట్టుపడుతున్నారు కాబట్టి ఏదో ఒక్కొక్కళ్ళకు 4 వేలు ఏర్పాటు చేస్తాలెండి. ఆనలభై వేలు ఇలా పారెయ్యండి. ఏంచేస్తాను. ఎన్నికష్టనిష్టూరాలకైనా తలపట్టాలి... ఊం త్వరగా లేవండి'

'అబ్బా! నలభైయేలే'

'మీయిష్టం...అదైనా ఎంతో ప్రయత్నం చెయ్యాలి'

'ఏదోనాలుగేలలో అయిపోతాదనుకున్నాది నలభై ఏలయింది...ఇంతకుముందు ఇరవై ఏలు...నాఆస్తంతా ఈదెబ్బతో'

'అలాకష్టపెట్టుకుంటే నాకెందుకయ్యా నీడబ్బు నావళ్ళో ఏమన్నా ఊడిపడుతుందా'

అంటూ కోపంగా లేవబోయాడు. అతనిచెయ్యిపట్టుకుని

'ఏటి శాస్త్రీ అంత కోపం? కూసంత తాళవయ్యా! నాకున్న మేడెక్కడైనా తాకట్టు పెట్టి ఇత్తాను...పెళ్ళాం నగలన్నీ అయిపోయాయిగా'

'ఐతే ఎప్పుడురాను?'

'ఎల్లుండి....'

'సరే....'

'ఎంతలో రావాలి ఎల్లుండి'

శాస్త్రి తయారవటం—

ఘల్లు ఘల్లుమని 40 వేలు శాస్త్రిచేతులో గుమ్మరిం చాడు పాపం అమాయకుడు అప్పలస్వామి.

'శాస్త్రి ఈదెబ్బతో పెసిడెంటుగిరి తప్పదంటవా'

'ఇంకాసంశయమా? మీరుప్రెసిడెంటు కాకపోతే జోడు గుళ్ళ టుపాకీ ఫారుచేయండి'

'ఎంతమాట ఎంతమాట'

'కాని ఒక్కపని చెయ్యాలి....వారితో మాత్రం మీరు లంచం ఇచ్చినట్లు చెప్పకూడదు. చెప్పితే ప్రమాదం తప్పదు. వాళ్లు రహస్యంగా తీసుకుంటున్నారేమో పబ్లిక్‌గాఅంటే చాలా చిన్నపోతారు'

'అట్టాసెప్పు. నేకపోతే అడిగినా అడిగేనేటోడ్నే'

'అలాతెలివి తక్కువ పనులు చేస్తారనేకదూ ముందుగా చెప్పడం'

'రచ్చించావు...ఈకాపీ ఉచ్చుకో'

శాస్త్రి, అప్పలస్వామి కాఫీ తాగుతూ ఉంటారు.

'ఏటి శాస్త్రీ తీపి నాకై పోయినట్టుందే!'

'నెవర్ మైండ్ (Never Mind)'

'శాస్త్రీ పెసిడెంటుగిరి తప్పిందా, పైపానాలు పైనేపోయి నాయన్నమాటే. మరిసూసుకో'

'మీకేం భయం లేదంటున్నాగా- భారం అంతా నాది. అంటూ లేచి సిగరెట్టు కాల్చుకుంటూ నలభై వేలూ పుచ్చుకొని వెళ్ళిపోయాడు.'

'ఉన్నా ఆ త్తంతా అద్దానం సేశాను. పెసిడెంటుపని వత్తాదో, పానాలే పోతాయో, అంతా ఆపడుకొండల ఎంకటే సునిదయ.

ఏమయ్యా! భాగమంతుడా! సెమటూడ్చి కట్టపడి గడించిన ఆ త్తంతా గంగపాలుసేసి మాగారమ్మి గొంతుకోత్తావా! పదిమందిలో సెబాసనేటట్టు పెసిడెంటు పనిత్తావా? ఏటో నీ దయ. నిస్కారంగా శాత్రిని నమ్మేశా.

అంటూ అప్పలస్వామి వెయివేల దణ్ణాలు పెట్టుకున్నాడు.

* * * *

ఎలక్షను రోజు రేపనగా శాస్త్రి 20 వేలు పారేసి మిగిలిన 20 వేలు తన జేబులో వేసుకొని మెంబర్లను పోగుజేసి, యింట్లో ఉంచాడు.

ఎలక్షను రోజు:-

అప్పలస్వామి కొత్తకోటు నల్లది పీకివరకూ గుండీలది వేసుకొని, కొత్తపెళ్లికొడుకులా తయారయ్యాడు. ఎలక్షనులో దెబ్బలాటలు, కొట్లాటలు చెప్పటానికి వీలులేదు. తిరిగేకారులు తిరుగుతున్నాయి, వచ్చేజనం వస్తూవున్నారు.

ఊరంతా హడావుడిగా ఉంది—

ఓటింగ్ అయింది.

ఓట్లు లెక్క పెట్టారు—

శాస్త్రి కెవ్వుమని కేకవేసి అప్పలస్వామిని కౌగలించు కున్నాడు.

'అప్పలస్వామి నాయుడుగారు 'ప్రెసిడెంట్' అయ్యాడు అంటే అయ్యాడన్నారు.

ఊరంతా గోలై పోయింది—

పెద్దమీసాలు మెలేశాడు అప్పలస్వామి.

మెడనిండా పూలహారాలు వేశారు.

'అప్పలస్వామి నాయుడుగార్కి జై'

'అప్పలస్వామినాయుడుగార్కి జై'

అంటూ దశదిశలు దద్దరిల్లేటట్లు ప్రజలు జయజయ నినాదాలు చేశారు.

అప్పలస్వామిగారిని శాస్త్రి మొదలైనవారు కారులో కూర్చుండబెట్టారు.

శాస్త్రికి, ప్రెసిడెంటుగారికి మెడలు మునిగేటట్లు పూలదండలువేశారు.

ఆవేడుక చూడటానికి వచ్చే అమ్మలక్కల సంబరం చెప్పలేం—

బేండుతో వచ్చే 'నాయుడుబావ' 'ప్రెసిడెంటు' ను గౌరవమ్మ క్రీగంటి చూచింది. ఇరువురూ పెద్దగా నవ్వుకున్నారు.

గౌరమ్మ హారతి ఇచ్చింది—

కారులో 'ప్రెసిడెంటు' గారు ఊరేగుతూ వెళ్లిపోయారు

1. ఈ ప్రెసిడెంటుగారి పరిపాలన ఎలాగుంటుంది—
2. 'వైస్-ప్రెసిడెంటు' శాస్త్రిగారి పరిపాలన ఎలాగుంటుందో—
3. శాస్త్రిగారి విధవముండ పరిచయం ఎలాగుంటుందో-
4. మిస్. లీలా ఎం. బి. బియస్. ప్రవర్తన ఎలాగుండేది, దీని తరువాయి రెండవభాగం—

## 'వైస్-ప్రెసిడెంట్' లో

చదవవలయును.

ఇక శెలవు.

వేణు ప్రెస్, ఆల్కట్‌తోట, రాజమండ్రి.—1945